# మార్క్సిజం పాఠాలు

## 3

తెలుగు సేత : ఆర్వియార్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**Marxism Paataalu - 3**
Translation from Englih to Telugu from the book
"A Dictionary of Marxisτ Thought" by R.Venkateswara Rao

రాజకీయ/సామాజిక/ఆర్థికశాస్త్ర గ్రంథాలు

ప్రచురణ నెం. : 22

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : నవంబర్, 2004



వెల: రూ. 8-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్ / సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.



ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాదు.

# ఉద్యమ ప్రస్థానంలో వెలుగుల దీపం

మార్క్సిజం ఒక శాస్త్రం - ఒక శస్త్రం. నిత్యం ఆచరణ గీటురాయిమీద ఈ శస్త్రాన్ని పదును పెట్టుకోవాలి. ప్రపంచ వ్యాప్తంగా భిన్నభిన్న ప్రాంతాలలోని సామాజిక సమస్యలను అధ్యయనం చెయ్యటంలోనూ వాటికి ఆచరణాత్మక పరిష్కార మార్గాలను కనుగొనటంలోనూ ఈ సిద్ధాంతం ఒక శాస్త్రంగా రూపుదిద్దుకుంది. నిత్యం కొత్త ఆలోచనల వెలుగులో ఆచరణల ప్రబోధంతో సృజనాత్మకంగా పరిపుష్టమవుతోంది.

మార్క్సిజం గుడ్డిది కాదు - ఇది ఒక పిడివాదం కాదు. ఆచరణ యోగ్యమైన జీవన సిద్ధాంతం. సమసమాజస్థాపన దిశగా ప్రయాణించే మార్గాన్ని సుగమం చేసే సాధనం. దేశకాల పరిస్థితులను గమనంలోకి తీసుకోవటంలో మార్క్సిజం ప్రగతిశీల దృక్పథాన్ని ప్రదర్శిస్తుంది. పోరాట శక్తులను వివరిస్తుంది. పోరాట సందర్భాలను పరిపక్వమొనర్చే, పద్ధతులను మనముందుంచుతుంది. విప్లవ శ్రేణులకు వెన్నుదన్నుగా నిలిచి, విప్లవ కార్యాచరణలో రాగల వ్యక్తిగత బలహీనతలను గురించి ముందుగానే హెచ్చరించి సరిదిద్దుకోగల మార్గాలను విశదీకరిస్తుంది. నిత్యం మారుతున్న దోపిడీ శక్తుల అవతారాల ముసుగులను తొలగించి వానిని ఎదుర్కొనగల శక్తివంతమైన పోరాట ఆయుధాలను ప్రజాఉద్యమకారులకందిస్తుంది.

అలాంటి మార్క్సిజం సిద్ధాంత అవగాహనను పెంచుకోవడానికి ఉద్దేశించిన గ్రంథాలు ఇవి. ఇప్పటికే ప్రాథమికంగా మార్క్సిజాన్ని కొంత అధ్యయనం చేసిన వారికీ గ్రంథాలు ఉపయోగపడ్తాయి. "ఎ డిక్షనరీ అఫ్ మార్క్సిస్టు థాట్" అన్న ఆంగ్ల బృహద్గ్రంథంలోని కొన్ని అంశాలను ప్రముఖ సాహితీవేత్త శ్రీ ఆర్వియార్ ఈ రూపంలో మనకందిస్తున్నారు. కొన్ని సందర్భాలలో అనువాదంగానూ, మరి కొన్ని సందర్భాలలో అనుసృజనగానూ రచన సాగింది.

క్లుప్తత, స్పష్టతలకోసం అనువైన – సమానార్థక తెలుగు పదాల కోసం పడ్డ శ్రమ మనకు కనిపిస్తుంది. తత్వశాస్త్రంలో ఎదురయ్యే ఆంగ్ల సాంకేతిక పదాలకు సరైన తెలుగు పదాల సృజన ఇప్పుడిప్పుడే ఓ స్థాయికి చేరుకుంటోంది. ఆర్వియార్ ఆ దిశగా చేసిన కృషి ఇందులో చూడగలం.

పాఠకులూ, కార్యకర్తలూ మార్క్సిజం వెలుగులో ఉద్యమిస్తున్న వారూ దీని ఉపయోగాన్ని గ్రహించగలరని మా ఆకాంక్ష."ఎ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్" సంపాదకులకూ, అనువాదకులకూ కృతజ్ఞతలు.

**ఏటుకూరి ప్రసాద్**
సంపాదకుడు
విశాలాంధ్ర ప్రచురణాలయం.

# విషయ సూచిక





# మతం

మార్క్స్, ఎంగెల్స్‌లు ఆనాటి జర్మనీలోని సమాజం గురించిన ఆలోచనతోనే ఆరంభించారు. ఆ తరవాత ఏంగెల్స్ చెప్పినట్టు, ఆనాటి జర్మనీలో సవ్యమైన రాజకీయ కార్యకలాపానికి అవకాశం అరుదు. అభ్యుదయ భావాలు యెక్కువగా ఛాందసమత విమర్శన ద్వారానే వెల్లడవాల్సి వచ్చేది. అవి సామాజిక, రాజకీయ తీరుని యెండగట్టే ఉద్దేశంతో వుండేవి. హెగెల్ చరిత్ర పరిణామ ధోరణి పద్దెనిమిదవ శతాబ్దపు తత్త్వవేత్తల సరళ భౌతికవాదం సంతుష్టికరంగా లేదు. క్రైస్తవమతం, తదితర అన్ని మతాలు వంచకుల మానస పుత్రికలని చెప్పే బలం దానికి లేదు. (ఎంగెల్స్, బ్రూనో బాయెర్, తొలి క్రైస్తవ మతం.) అవసరం అయింది యేమిటీ అంటే మార్క్స్ "క్రిటిక్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ రైట్, ఇంట్రడక్షన్"లో రాసినట్టు మానవ పరిస్థితుల విశ్లేషణ, మానవులకి విధాయకంగా తప్పదన్నట్టు వుండే సంబంధాల విశ్లేషణ. మతం మానవుని అసంపూర్ణ స్వయం చైతన్య వ్యక్తీకరణ: అంటే నైరూప్య మానవుడని కాదు, సాంఘిక మానవుడు లేదా సమష్టి మానవుడు. అది మానవ అస్తిత్వపు వక్రీకరణ, యేమంటే సమాజమే వక్రీకృతంగా వుంది కాబట్టి. మార్క్స్ చెప్పినట్టు, ఆయన సుప్రసిద్ధమైన మాటల్లో, మతం అనేది హృదయంలేని ప్రపంచపు హృదయం, నల్లమందు - లేదా బాధా నివారిణి - బాధలుపడే ప్రజా బాహుళ్యానికి. మనుషులకు నిజమైన ఆనందం దక్కడానికి మార్గం, యిలా ప్రత్యామ్నాయాలకోసం పలవరింపచేసే జీవితం నుంచి తమని తాము విముక్తం చేసుకోవడం. స్వయం విమోచన ఒట్టి కోరదగింది మాత్రమేకాదు, తనని అసంపూర్ణంగా, పతనం అయినట్టు దిగజారిన ప్రతిదాన్ని విసిరివేసి అత్యున్నత సామర్థ్యాన్ని అందుకోవాల్సివున్న కర్తవ్యం కూడా అని మార్క్స్ అన్నాడు.

మతాన్ని విమర్శించే ఉదారవాది మతానికి వున్న భౌమిక మూలాల్ని గుర్తిస్తాడు సరేగాని, సమాజాన్ని మొత్తం పునర్ వ్యవస్థీకరించడం ద్వారా మాత్రమే దాన్ని పెకలించగలమని గుర్తించడం లేదని మార్క్స్ "ఫోయర్ బాఖ్ మీద సూత్రీకరణ"ల్లో ఆరోపిస్తాడు

(4వ సూత్రీకరణ) అసలు ఫోయర్‌బాఖ్ దాన్ని వదులుకోవాలని చూడలేదంటూ ఎంగెల్స్ తరవాత ఒకసారి రాశాడు (ఫోయెర్‌బాఖ్ విభాగం 3.) ఆయన దాన్ని పునర్ వ్యవస్థీకరించాలనే అనుకున్నాడనీ ఎంగెల్స్ అన్నాడు. ఫోయర్‌బాఖ్ చరిత్రని మత పరివర్తనల క్రమంగా దర్శించాడు. సామాజిక భౌతిక మార్పులకు మతం పరిణామాలు తోడయేయి అని చెప్పేదానికి బదులుగానని ఎంగెల్స్ భావం. యువకులుగా వున్నప్పుడు, అలాంటి మార్పులు (సాంఘిక, భౌతిక) వికాసాన్ని వేగవంతంగా పరిపూర్తిగా యెలా తీసుకువస్తాయో అని చెప్పడానికి చాలా ఉత్సాహం కనబరిచారు. పెట్టుబడిదారీ వేషంలో భౌతికవాదం కూడా, మత భ్రమలవల్ల రూపుతీసుకున్న వాళ్ళ జీవితాలు సోషలిజానికి చాలాముందే, దాన్నుంచి విముక్తం అవుతాయనీ వాళ్ళు విశ్వసించారు. సకల సంబంధాలనీ వ్యాపారీకరించడం ద్వారా, పరిశ్రమ మతాన్ని, నీతినీ రెండింటినీ తుడిచి పెట్టేస్తుందని లేదా వాటిని తేటతెల్లంగా కనిపించే అనృత స్థాయికి కుదించి వేస్తుందనీ వాళ్ళు "జర్మన్ భావజాలం"లో రాశారు. (ఒకటిన్నర శతాబ్దం తరవాత ఆ దిశలో అది మంచి పురోగతి సాధించిందని చెప్పగలిగే అవకాశం వుంది). మతపర విశ్వాసం శ్రామిక ప్రజలమీద పట్టు సాధించలేదని మార్క్స్, ఎంగెల్స్‌లు యెక్కువ నమ్మేరు. శ్రామిక ప్రజ మరకలు లేని శుభ్రమైన పలక మనసుకలదని వాళ్ళు భావించడం కనిపిస్తుంది, నిజానికి అది సరికాకపోయినా. అలాంటి అవాస్తవాలన్నీ వాదనలవల్లకంటే యెక్కువగా అనుభవం వల్ల చెదరిపోతాయని వాళ్ళు అభిప్రాయపడ్డారు. కాని నూతన శ్రామికవర్గం వాటివల్ల యెన్నడూ బాధితం కాలేదు, లేదా యేనాటినుంచో వాటిని వదిలేసింది.

చరిత్ర చెత్తబుట్టమీద నమ్మకం మరింత సంకేత సూచకంగా మార్క్స్ వ్యాసం "యూదుల సమస్య" అన్నదాంట్లో ధాటీగా కనిపిస్తుంది. యూదులు గనక తమ ప్రకృత చిల్లర వర్తకం జీవిత భారానికి నీళ్ళు వదులుకున్నట్లయితే గనక 'జూడాయిజం' శీఘ్రగతిన అదృశ్యం అవుతుందని ఆయన చాటేడు. యింతకంటే మరింత పటువుగా "పెట్టుబడి" (1, అధ్యాయం 1, ఆఖరి విభాగం) యీ నమ్మకాన్ని పునరుద్ఘాటించాడు. మతపర భ్రమలకి చెయ్యవలసిన విధులు యేమీలేవు,

ఉత్పత్తి వ్యవస్థ అసంగతత్వం మీద ముసుగుకమ్మడం తప్ప. మనుషులు ఒకళ్ళతో ఒకళ్ళు సుసంగత సంబంధాలు కల్పించుకున్నప్పుడు, సమాజం యావత్తునీ దాని దుర్లక్షణాల నుంచి బాగుచేసినప్పుడు ఆ ముసుగు తొలగిపోతుంది అనీ అన్నాడు.

మార్క్స్ యువకుడుగా వున్నప్పుడు మతం గురించి చాలా క్రమపద్ధతిలో ఆలోచించాడు. ఎంగెల్స్ మతం విషయం గురించి పదేపదే ప్రస్తావించేవాడు. బహుశా మత తీరు పెంపకం వల్ల దాన్నుంచి ఆయన కొంచెం యిబ్బంది పడుతూనే, బయటపడ్డాడు. రైతుయుద్ధం 1524-25 అన్న గ్రంథంలో, చరిత్రకారుడిగా ఆయనకు మతం రాజకీయాల అంతర్నాటకం గురించి చర్చించడానికి తగినంత అవకాశం లభించి వుంటుంది. ఒక విప్లవ సంక్షోభంలో అది యెలా వుంటుందీ చర్చించగలిగాడు. యూరప్‌లో మత యుద్ధాలు అని పిలిచేవి జరిగాయి. 16, 17 శతాబ్దాల్లో అవి జరిగేయి. మధ్యయుగాల్లో చర్చికి, ఛాందస వ్యతిరేకతకీ మధ్య తలలు ఢీకొన్నాయి. అక్కడ వాస్తవ పరిస్థితిని వర్గపోరాటాల్లో దర్శించాల్సి వుంది అని ఆయన వాదించాడు. అవి పోటీపడే భౌతిక ప్రయోజనాలమీద జరిగాయి అని చెప్పేడు. మరి జర్మన్ విద్వత్ బుద్ధి వాటిలో మతపర పేచీల్ని తప్ప చూడలేక పోయింది. ఆ రకంగా గత కాలపు భ్రమల్ని వాటికిగా వాటిని పైకి కనిపించినట్టు వివరించుకుంది. (ఆ గ్రంథం, అధ్యాయం 2.) మతం పట్ల శుద్ధ వ్యతిరేకాత్మక దృష్టిగా యిది కనిపించవచ్చు. కాని అధికార ఆరాధనలకు నిరసనగా పుట్టుకొస్తున్న అభ్యుదయకర సామాజిక పాయలుగా వుండే అవకాశమూ దాన్నిబట్టే వస్తుంది. పునరుజ్జీవనకాలంలో అదే అన్నిట్నిమించీ వుంది.

"యాంటీ - డూరింగ్" ఆఖరి అధ్యాయంలో ఎంగెల్స్ మతం విషయాన్ని మళ్ళీ యెత్తుకున్నాడు. మానవ మనుగడను కమ్మివేసే శక్తుల తిక్క చొరబాటు అన్నాడు. ఆ శక్తులు మొదట్లో ప్రకృతిశక్తులు. అవి వైరుధ్యభరిత పురాణ కల్పనలకు తావు యిచ్చాయి. ఆ తరవాతా పరాయివేం కాదుగాని, మరీ తరవాత నిగూఢ సాంఘిక వ్యవస్థ కల్పితాలయేయి. ఏకేశ్వరోపాసన వచ్చింది. యీ భావనలో అంతకుముందున్న దేవతల విశేషాంశలూ పోగయేయి. మానవ నైరూప్య

భావనకు మూర్తికల్పన యీ ఏకేశ్వరభావన. యిలా ఏకేశ్వరభావన ఆవిర్భావం ఫోయెర్‌బాఖ్‌లో మళ్ళీ కొత్తగా (అధ్యాయం - 2) జాడ వెతుక్కుంది. మతపర భావనలు భౌతిక జీవితానికి దూరంగా మరింతగా నిలబడినట్టు, దాన్నుంచి పూర్తిగా విడిపోయివున్నట్టు కనిపిస్తున్నాయని ఎంగెల్స్ చూశాడు. అదీగాక అవి సమకాలీన జీవితం నుంచి యెంత మాత్రమూ నేరుగా ఆవిర్భవించడంలేదు, సుదూరగతం నుంచి అందిపుచ్చుకుంటున్నాయి. దీనికి ఆయన సమాధానం చెప్పేడు. ఆ "భావజాలమే", తన కర్తవ్య పరిపూర్తికి - యదార్థాన్ని మినహాయించే భావాలతో తృప్తిని మనకి అందించేందుకు - వారసత్వంగా అందివచ్చిన, దీర్ఘకాలిక కామనల నుంచి వృద్ధిచెంది తీరాలి. కాని మత భావాల్లో మార్పు సామాజిక పరిస్థితులలో, వర్గ సంబంధాల్లో వచ్చే మార్పులకు ప్రతిస్పందించేటట్టు సాగాల్సి వుంది.

తూర్పు యూరప్‌లోని తొలి సోషలిస్టులు విస్తృత రైతు జనాభా మధ్య వున్నారు. రష్యాలో మరీ గాఢంగా మతతత్వంలో కూరుకుపోయిన రైతాంగం అది. ఆ మతతత్వం చిత్రమైన మౌఢ్యంతో వున్నటువంటిది. అది సర్వదా జార్‌ల పాదాక్రాంతం అయే వుండేది. జారిస్టు రష్యాలో నానా గోత్రాల క్రైస్తవ ఆరాధనలు క్రైస్తవేతర మతాలు వుండేవి. దాంతో పరిస్థితి మరీ జటిలం అయింది. అభివృద్ధి సాధించాలీ అంటే సకల మతాలమీదా అలుపులేని పోరాటం చెయ్యవలసి వుంది. అందుకనే నూటికి నూరుపాళ్ళూ భౌతికవాదం కావాలన్న రాజీలేని ప్లెహనోవ్ వైఖరి వచ్చింది. భౌతికవాద చింతన సుసంపన్న వికాసాన్ని ఆయన శ్లాఘించాడు. 18వ శతాబ్దపు తత్వశాస్త్రాల గురించి ఆయన రాసిన రచనల్లో యిది కనిపిస్తుంది. మతం శక్తులన్నీ ఉడిగిపోయేయని ఎంగెల్స్ అంతకు ముందే చెప్పిన మాటల్ని ప్లెహనోవ్ మినహాయింపు ల్లేకుండా అంగీకరించాడు. (మెటీరియలిజ్మస్ మిలిటన్స్). కాని ఆయన నాటి వాతావరణంతో ఒక విషయాన్ని గ్రహించగలిగే సౌలభ్యం ఆయనకు కలిగింది. అదేమిటీ అంటే మతం శ్రామికవర్గ బృందాలమీద తిరోగమన ప్రభావం కలిగించ గలిగిన శక్తితో యింకా వుంది అన్న విషయం. ఆ శ్రామికవర్గం యింకా సంపూర్తిగా వర్గచైతన్యం సంతరించుకోనటు వంటిది. కొంతమంది అభ్యుదయవాదులు 1905 విప్లవ వైఫల్యం

తరవాత పక్కకి వెళ్ళడం, నిరాశ, నిస్పృహలవల్ల ఒక రకమైన మార్మికతలో పడిపోవడం, "భగవంతుడి రూపకల్పన" దారిపట్టడం - ముఖ్యంగా లూనాచార్‌స్కీలాంటి వాళ్ళకు సంబంధించి - ఆయనకు ఆగ్రహం కలిగించాయి.

ఈ విషయం లెనిన్‌కి యింకా ఆవేదన కారకం అయింది. బలవంతంగా మతాన్ని రద్దుచేసే తెలివితక్కువ పని గురించి ఎంగెల్స్ హెచ్చరించనే హెచ్చరించాడు. పారిస్ కమ్యూన్‌కి చెందిన బ్లాంక్విస్ట్ సభ్యులు అలా రద్దు చెయ్య చూశారు. (ప్రోగ్రామ్ ఆఫ్ ద బ్లాంక్విస్టొ కమ్యూన్ రిఫ్యూజీస్) లెనిన్ యీ విషయం అంగీకరించాడు. మత జాడ్యం భీరువులైన మేధావులకే పరిమితం అయి లేదనీ, కొంతమంది శ్రామికులలోనూ వుంటుందనీ అన్నాడు. వాళ్ళు పెట్టుబడిదారీ విధాన అంధశక్తులకు బంధితులైపోతారు. పెట్టుబడిదారీ విధానం వూహించలేని విపత్తులతో వాళ్ళని భయపెడుతూనే వుంటుంది అనీ ఆయన గుర్తించాడు. మతం అనేది సొంత వ్యవహారంగా వుండాలి అని ఆయన 26 మే 1909న రాశాడు. అది ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారం కాదు. సోషలిస్టు పార్టీకి సంబంధించి అసలేకాదు. అలాగని మతంలో విశ్వాసం వున్నవాళ్ళని పార్టీ నుంచి బహిష్కరించాలని కాదు, వాళ్ళు అంతరంగంలో సోషలిస్టులైతే గనక. పార్టీ కార్యక్రమంలో నిరీశ్వరవాద కార్యక్రమం యేదీ లేదు. మతం పట్టు ఆర్థిక శక్తుల చాలనం మీద ఆధారపడి వుంటుంది కాబట్టి, కార్మిక వర్గాన్ని దానికి వ్యతిరేకంగా ఒట్టి ప్రకటనలతోనే పరిరక్షించలేం. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాటం ద్వారానే పరిరక్షించగలం. అంచేత స్వర్గ వ్యవహారాల విషయంలో ఐక్యంకంటే యీ సందర్భంలో ఐక్యం యెక్కువ అవసరం. (మతం పట్ల కార్మిక పార్టీ వైఖరి). అదే విధంగా 1913లో స్టాలిన్ చేసిన ప్రకటన ఒకటుంది. అన్ని మతాలూ తమతమ విశ్వాసాల్ని అనుసరించేందుకు స్వేచ్ఛ వుండాలన్న దాన్ని పార్టీ సమర్థించాలని. కాని అభివృద్ధికి మతాలన్నీ అవరోధాలే అని చెప్పే యీ ప్రకటనలో వూనిక కొంచెం యెక్కువే వుండచ్చు. (మార్క్సిజం, జాతుల సమస్య.)

రష్యాలో పార్టీ అధికారంలోకి వచ్చినప్పుడు యీ అవరోధం నిజంగానే అడ్డం పడింది. దీనికి సంబంధించి బుఖారిన్ "చారిత్రక

భౌతికవాదం" అన్న గ్రంథంలో మరింత పటువైన ధోరణి అవలంబించాడు. అది సిద్ధాంతపరంగానూ, ఆచరణాత్మకంగానూ కూడా వుంది. మార్క్సిజం సర్వకాల సర్వావస్థల్లోనూ సన్నద్ధంగా వుండేటట్టే, ఆయన మతం అనేది వ్యక్తిగా మనిషి పరిస్థితి నుంచి, మృత్యుభీతి నుంచి, అలాగే పూర్వం రోజుల్లో భావించినట్టు గతించిన ప్రాణుల నుంచి ప్రత్యామ్నాయంగా లేదా ఉప ఉత్పత్తిగా పుట్టుకొచ్చింది - అన్న అంశాన్ని కొట్టిపారేశాడు. తరుణ, విప్లవ శ్రామికవర్గం దృక్పథం రీత్యా భౌతికవాద పూరితంగా వుండడమే తార్కికం, కాలం చెల్లిన వృద్ధపాలక వర్గం మతం సుషుప్తిలో కూరుకు పోవడంలాగానే అని బుఖారిన్ వాదించాడు. జారిస్టు అధికారవర్గ సోపానశ్రేణికి సమాంతరంగా ఆర్తడాక్స్ చర్చి గగన సోపాన శ్రేణి వుండడాన్ని ఆయన హేళన చేశాడు. యీ చర్చిలో దేవతాగణాలకి సెయింట్ మైఖేల్ సర్వసేనాధిపతిగా వుంటాడు కదా. కాని మతాన్ని చురుగ్గా వ్యతిరేకించాలి. తనంతట తానుగా అది అంతరిస్తుంది అని చేతులు కట్టుకు చూస్తూ వుండడంలో అర్థం లేదన్నాడు. విశ్వాసకులు నూతన వ్యవస్థపట్ల సందిగ్ధ విధేయతతో వుండే ధోరణి, బాధ్యతాయుతమైన పదవులకు యోగ్యత లేకపోవడం తప్పనిసరిగానే పెరిగాయి.

మార్క్స్, ఎంగెల్స్‌లు మతం గురించి ప్రయోగాత్మకంగా చేసిన పరిశోధనల్ని త్వరలోనే వాళ్ళ అనుయాయులు అందుకున్నారు. ముఖ్యంగా కాట్‌స్కీ. ఆయన తొలి క్రైస్తవ చరిత్ర రంగంలో కృషి చేశాడు. పన్నెకాక్ (1938) బూర్జువా వర్గం భౌతికవాదానికి సంధించుకుని వుండడం గురించీ, ముందు పీటీకి వచ్చే దశలో దాని తత్వధోరణి గురించీ సంక్షిప్తంగా చెప్పిన వాళ్ళల్లో వున్నాడు. బూర్జువా వర్గం ఫ్రెంచి విప్లవకాలంలో చెలరేగిన జనబాహుళ్య అసంతృప్తితో భీతిల్లిపోయింది. జనాలని వాళ్ళ వాళ్ళ స్థానాల్లో వుంచడానికి మతం వేపు మళ్ళింది. అలా కథని అడ్డం తిప్పెయ్యడం మార్క్సిస్టులు వివరించినట్టు చరిత్ర గురించిన గతితార్కిక దృక్పథంతో తూగేటట్టే వుంది, పాత సాదా భౌతిక దృక్పథం ఆ పని చెయ్యలేదు. వాళ్ళు క్రైస్తవ మతంలాంటి ప్రత్యేక మతం గురించేకాక అసలు మతం పునాదుల్లోకే వెళ్ళి శోధించనారంభించారు. నీతి పరిణామం గురించి కాట్‌స్కీ చేసిన శోధన తొలిభాగంలో, ఆయన

కూడా ఎంగెల్స్ అంతకుముందు చిక్కుపడినట్టే, పాత అనైతిక దేవతలనుంచి ఏకేశ్వర, నైతికం చేసే నమ్మకాలు పుట్టుకురావడంగురించి చిక్కులుపడ్డాడు. చరిత్ర, పూర్వదశ లేదా మానవశాస్త్ర రంగంలో మార్క్సిజం తనదైన ముద్ర వెయ్యగలిగింది. దీనికీ దర్క్‌హీమ్ శాఖకీ చాలా మట్టుకు ఉమ్మడి అంశం వున్నట్టు తెలియవచ్చింది. కానైతే సామాజిక నిర్మాణం అనేది యేదో స్థాపితమైనదన్న భావన బదులు మార్క్సిజం - దాన్ని మనుషులకీ, వాళ్ళ పరిసరాలకీ మధ్య పరస్పర ప్రతిచర్యగా భావిస్తుంది. యిదే వ్యాఖ్యాత (రాబర్ట్‌సన్ 1972) మరో అంశాన్నీ జోడించాడు. అచరణలో, ఆ రెండు శాఖలూ వాటి కచ్చితమైన సూత్రీకరణలు తలవూపే దానికంటే యెక్కువ స్వయం ప్రతిపత్తినే మత పరిణామానికి వున్నట్టు అంగీకరించాయి.

క్రైస్తవేతర మతాల గురించి తెలుసుకుందుకు మార్క్స్, ఎంగెల్స్‌లు యెక్కువ ఆసక్తి చూపించారు. యూరప్ నుంచి బయటి ప్రపంచం మీద దృష్టి సారించారు. ప్రాచ్యచరిత్ర మతచరిత్ర వేషంతోనే వున్నట్టు తోస్తోందని మార్క్స్ అన్నాడు (ఎంగెల్స్‌కి రాసిన ఉత్తరం, 2 జూన్ 1853.) ఆయన భారతదేశం గురించి రాసిన ఒక వ్యాసంలో (10 జూన్ 1853) ఒక సూచనప్రాయమైన విషయాన్ని చెప్పేడు. భారతదేశంలో భోగలాలస ఐశ్వర్యం, పరమ దారిద్ర్యం పక్క పక్కనే వుండడం "హిందూ మతం"లో ప్రతిబింబిస్తుందని అన్నాడు. యీ మతం "ఇంద్రియలౌల్య పుష్కలత్వం", "శరీర శోషణ పూరిత సన్యాసి తత్వా"ల కలగూరగంప అన్నాడు. ప్రకృతిమీద నిస్సహాయంగా ఆధారపడడం అనేది ప్రకృతి దేవతల, జంతువుల ఆరాధనలో వెల్లడవుతోందనీ ఆయన అన్నాడు. తరవాతి తరం మార్క్సిస్టులు యితర మతాల పట్ల, ముఖ్యంగా ఇస్లాం పట్ల, ఆసక్తి చూపించారు.

యూరప్ బయట కొన్ని ప్రాంతాల్లో చాలామంది మార్క్సిస్టులు తయారయేరు. వాళ్ళు తమ పరిశీలనలు తాము చేశారు. భారతదేశంలో మార్క్సిస్టులు వాళ్ళ ప్రాచీన కాలం గురించి అధ్యయనాలు చేశారు. బ్రాహ్మణ మతం గురించీ, బౌద్ధమతం గురించీ వాళ్ళు అధ్యయనం చేశారు. నఖ శిఖ పర్యంతం విగ్రహ విధ్వంసం కావించే కోశాంబి అత్యంత ఆరాధనీయమైన పవిత్ర గ్రంథం "భగవద్గీత"ను

తూర్పారబట్టేడు. "గీత" "ఎదురెదురు ధ్రువాల్ని అనుసంధించేటట్టు కనిపించే నైపుణ్యం" వున్నదనీ, "పరమ అవకాశవాదమనీ" వివరించాడు. వైభవోపేత కాలంలో భారతీయ చింతనలో భాగంగా బలమైన భౌతికవాదం వుందని చట్టోపాధ్యాయ (దేవీప్రసాద్) నొక్కిచెప్పేడు. జైనమతం, బౌద్ధమతం నాస్తిక తత్వశాఖల నుంచి ఆవిర్భవించేయనీ, రాను రాను భారతదేశంలో సర్వకాలాల్లోనూ నిండుగా వున్న మూఢనమ్మకాలతో కమ్ముకుపోయేయనీ రాశాడు. మరిన్ని మార్క్సిస్టు పరిశోధనలు రావాల్సి వుందిగాని, మతకల్లోలాల వల్ల యిది సునిశిత అంశం అయింది. అయితే ఒక విషయం చెప్పుకోవాలి. అదేమిటీ అంటే, 1947 దేశవిభజనకు ముందు, అంతటి లౌకిక తత్వమూ వున్న నెహ్రూ మాదిరీ, భారతదేశ కమ్యూనిస్టులు మత విద్వేషాల విధ్వంసక శక్తిని ఆకళింపు చేసు కోవడంలో విఫలమయేరు. చైనాలో కొమోజొ పథనిర్దేశక మార్క్సిస్టు చరిత్రకారుడు. ప్రాచీన కాలంనాటి పితృదేవుళ్ళ ఆరాధనకి సొంత ఆస్తి ప్రవేశానికీ సంబంధం వుందని చూపించాడు. కేంద్రీయ రాజకీయ అధికారంతో పరమదేవుని ఆరాధన వచ్చింది. యేమంటే దానికి ఆకాశం నుంచి అనుమతి పత్రం అవసరం అవుతుంది. (డర్లిక్, 1978.) మార్క్స బౌద్ధిక జీవిత ఆరంభంలో మాదిరీ, మార్క్సిజం మత విశ్లేషణను చారిత్రకంగా చెయ్యడం అనేదాన్ని ప్రేరణాత్మక కర్తవ్యం అని పరిగణించినట్టు నిజానికి చెప్పుకోవాలి.

# హిందూమతం

హిందూమతం పట్ల మార్క్సిస్టు ఆసక్తి మార్క్స నుంచే వుంది, ఆయన క్రమపద్ధతిలో యీ అంశం గురించి అధ్యయనం చెయ్యకపోయినా. హిందూమతం మార్క్స దృష్టిలో పడక, నలిగిపోయిన సమాజపు సిద్ధాంతం. యీ మతంలో జుగుప్సాకరమైన అంశాలపట్ల యెక్కువమంది యూరపియన్ల మాదిరీ ఆయనకీ యేవగింపు వుంది. "సాల్‌శెట్టి దేవళంలో మనల్ని బెదరగొట్టే దేవతా భీకర మూర్తులకంటే దారుణమైన భీకరాకారాల సమ్మేళనం" అన్నది ఆయన సూత్రీకరణ.

ఆసియా తరహా నిరంకుశత్వానికి అంటుకట్టిన బ్రిటిష్ నిరంకుశత్వం గురించి ముక్తాయింపుగా ఆయన యీ మాటలు అన్నాడు. హిందూ "స్వర్ణయుగం" అనేది గతంలో వుందా అన్న శంక ఆయన భారతీయ అనుయాయుల్లాగనే ఆయనకీ వుంది. యీ యుగంలో భారతదేశం బయట మార్క్సిజం హిందుమతం గురించే పట్టించుకుంది. అది కూడా సామాన్యంగా మతం అన్న అంశంలో భాగంగానే ముఖ్యంగా వుంది. భారతదేశం లోపల హిందూమతంతో ముడిపడివున్న కార్యక్రమాల గురించే యిటీవలి కాలంలో మునిగితేలడం కనిపిస్తుంది. జాతీయోద్యమంలో దాని పాత్ర, మత ఆవేశకావేషాలు, ఫలితంగా విభజన, హత్యాకాండ సంభవించడం లాంటి సమస్యలే దేశంలోపల యెక్కువ ఆందోళనకరం అయినవి.

రోమిలాథాపర్ చెప్పినట్టు ప్రాచీన భారతదేశానికి సంబంధించి "హిందూమతం" అన్న పదబంధాన్ని వాడడమే అసంగతం. కాని, ఆర్యదండయాత్రల వైదిక ఆరాధన నుంచి రెండువేల సంవత్సరాలుగా పెరుగుతూ వచ్చిన మతాన్ని సూచించడానికి యిది అనువుగా వున్న పదబంధం. యిది చాలా సంక్లిష్ట పూరితమైంది. విశ్వాసాలకి సంబంధించి నిర్దిష్టంగా నిర్వచించ సాధ్యం కానిది. యిందులో ఆర్య, ద్రావిడ విశ్వాసాలు సమ్మిళితం అయేయి. ఓ మేరకు బౌద్ధమత, జైనమత ప్రభావాలూ వచ్చి చేరాయి. ఉపనిషత్తుల నుంచి లేదా తరవాత వచ్చిన వేద సంప్రదాయం నుంచి పరబ్రహ్మ భావన ఆవిర్భవించిందని థాపర్ అంటారు. ఆ భావన మూర్తిత్రయారూపం పొందింది. సృష్టి, స్థితి, లయ, కారుల భావాలు వచ్చాయి. యీ భావాల్లో ప్రకృతి నియమం ప్రతిఫలిస్తోంది – పుట్టుక, జీవితం, మరణం. ఆ తరవాత యీ త్రయంలో తొలి దేవర అయిన బ్రహ్మ వెనక్కి తగ్గడం జరిగింది. మిగిలిన విష్ణు, శివులిద్దరూ శాశ్వత దేవతలుగా నిలిచారు. హిందువుల ఆరాధన అందుకున్నారు. యీ యిద్దరిలో శివుడు, ఆర్య – ద్రవిడ సమ్మిశ్రితం, పునరుత్పత్తి క్రతువులకు సంబంధించినవాడు. ఆ తరవాత కాలంలో యజ్ఞయాగాది కర్మకాండలనుంచి భక్తివేపు మళ్ళడం జరిగింది. యిందులో భగవంతుణ్ణి వ్యక్తిగతంగా ఆశ్రయించడం కనిపిస్తుంది. తరచుగా పారవశ్య భక్తి వెల్లడవుతూ వుంటుంది. "యిది తరవాతి హిందూమతంలోని చలనశీల రూపం." మధ్యయుగాల చివరినాటికి

కబీర్, నానక్‌లాంటి బోధకులు ఇస్లాం మత భావాలు చొప్పించి భక్తి ఉద్యమానికి నూతన దిశ నిర్దేశించారు. వీళ్ళు సంక్షుభిత సహృదయంలో అణగివున్న పట్టణ ప్రజానీకం అనుభూతుల్ని వ్యక్తీకరించారు. అలాగే గ్రామీణ చేతివృత్తుల వాళ్ళకి బస్తీ జీవితంతో సంబంధమూ కలిగించారు.

వ్యక్తిగత భక్తి అనేది ఓ రకమైన మార్మికవాదం లాగానే, పురోహిత ఆధిపత్యం నుంచి తప్పించుకోవడమే. కానైతే ఆ మాటకి వస్తే తీవ్రం అయింది కూడా. దీనిలోని ఒక ధోరణి దేవాలయం. ఒక వ్యవస్థగా సంపన్న ద్రవ్యవనరుగా వుండేది దేవాలయం. దక్షిణ భారతదేశంలో మధ్యయుగాల్లో వర్తకులు, వాణిజ్య శ్రేణులు దేవాలయాలకు భూరిదానాలు చెయ్యడం కనిపిస్తుంది. బహుశా హెచ్చుస్థాయి సాంఘిక హోదా, మన్నన పొందడం కోసం అయివుంటుంది. మరి ఆధ్యాత్మిక దీవెనలు వుండనే వుంటాయి.

ఆర్. ఎస్. శర్మ ప్రాచీన భారతం గురించీ, ఆధునిక హిందూమతం గురించీ అభిప్రాయాల వాహినులు యెలా వున్నదీ తెలియజేస్తూ ఒక వ్యాసం రాశాడు. వీటిలో కొన్ని చారిత్రక భౌతికవాదం నుంచి ప్రేరణ పొందినవి. రుగ్వేదంలో "రుక్కుల ప్రధాన లక్ష్యం ఆర్యుల భౌతిక సంపద" పెరగాలన్న ప్రార్థనే అని మరో వ్యాసంలో ఆయన రాశారు. ధర్మానికి ప్రధానంగా కావాల్సింది అగ్రవర్ణాల ఐశ్వర్య సాధన, దిగువ వర్ణాలకీ, స్త్రీలకీ అంతలాకాదు, వాళ్ళు లొక్కు స్త్రీలనీ, శూద్రుల్ని కులవ్యవస్థ బానిసత్వంలో "ఒకే గాటన కట్టిన"ట్టు ఆయనే మరో చోట రాశాడు. స్త్రీలు, శూద్రులూ "సమాజంలో పరమ నికృష్ట తరగతుల వాళ్ళు" అని ఆయన తెలియజేశాడు. స్మృతి కర్త మనువు ధర్మసూత్రాల్ని రూపొందించాడు. యీ ధర్మసూత్రకర్త "స్వేచ్ఛాయుత ఆలోచనకీ, తార్కికతకీ బద్ధవ్యతిరేకి" అని దేవీప్రసాద్ చట్టోపాధ్యాయ గుర్తు చేశాడు. యిందులో వింత యేమీ లేదు. "బానిస బతుకులకు సమాధానపడిపోయి జీవిత భారం లాగించే అశేష శ్రమజీవులు" అణగి వుండేటట్టుచేసే సాంఘిక వ్యవస్థను నిలబెట్టాలీ అంటే మార్మికం చెయ్యడం, అలాగే నొక్కిపెట్టి వుంచడం అవసరం. చట్టోపాధ్యాయ యిందుకు వ్యతిరేకంగా, సందేహ భావుకంగా ఈ భారతీయ చింతనలోవున్న పార్శ్వానికి ప్రాముఖ్యం యిచ్చాడు. చాలామంది విద్వాంసులు చెప్పిందాన్ని అంగీకరించాడు. బౌద్ధమతమే తొలి సాంఖ్య చింతనాపాయకు దోహదం

చేసిందని వాళ్ళు అన్నారు. యీ రెండు కూడా "దైవభావనను తిరస్కరించడంలో" వివేచనాత్మకంగా, నీళ్ళు నమలకుండా" వున్నాయనీ చెప్పేదు.

కమ్యూనిస్టు పార్టీ నాయకుడు, చరిత్రకారుడు అయిన ఇ.ఎమ్.ఎస్. నంబూద్రిపాద్ దీనికి సంబంధించిన అంశాల్ని యెత్తుకున్నాడు. కేరళ రాష్ట్రం బ్రాహ్మణ మతాన్ని అవలంబించింది. కాని ఆ ప్రాంతంలో వున్న అనేక ప్రాచీన ఆచారాలని తన రీతిలో నిలుపుకునే వుంది. ఉత్తర భారతదేశంలో మాదిరీ కాకుండా మధ్యయుగాలలో భూమి మీద స్వంతస్వామ్యం వుండే ఫ్యూడల్ లక్షణాల వేపు సాగింది. యీ మార్పు జరిగే క్రమంలో, ఆధిపత్య వర్గానికి వత్తాసు పలికే విస్తృత వివాదస్పద సాహిత్యం, దాని మత భావజాలాన్ని యెత్తి పట్టడం వచ్చాయి. వాటి గమ్యాల్లో ఒకటి బౌద్ధమత నిర్మూలన.

రాహుల్ సాంకృత్యాయన్ సుప్రసిద్ధ బౌద్ధానుయాయి అయిన కమ్యూనిస్టు. ఆయన యెన్నో గ్రంథాల్ని రాశాడు. కాల్పనిక సాహిత్య ధోరణిలో విమర్శనాత్మక చారిత్రక రచనలు చేశాడు. యుగ యుగాలుగా హిందూమతం యెలా పరిణమించిందో ఆయన రాశాడు. యిటీవలి కాలంలో తమ పుట్టు పూర్వోత్తరాల గురించీ, యితర మతాల గురించీ తెలుసుకునే చారిత్రక ఆధారాల అన్వేషణలో యితర మత రచయితలూ పాక్షికంగా మార్క్సిస్టు దృక్పథాన్ని అనుసరించారు. దీనికి ఉదాహరణ యిద్దరు కాథలిక్కులలో కనిపిస్తుంది. భారతదేశంలోనూ, శ్రీలంకలోనూ పనిచేసే హ్యూటర్ట్, వెమెల్సినెర్‌లు వీళ్ళు. వైదిక ఆర్యుల గాథలు మొదట్లో సంచారజీవుల అవసరాల్ని ప్రతిఫలిస్తాయి అని వాళ్ళు అన్నారు. ఆ తరవాత ఆర్యులు ప్రత్యేక దేవతా గణాల్ని పెంపొందించుకున్నారు. యిది వ్యవసాయానికి సాగిన పరిణామాన్ని సూచించింది. మధ్యలో పురోహితుని జోక్యం వచ్చింది. ఎందుకనీ అంటే "దేవుడే దేవునితో మాట్లాడగలవాడు కాబట్టి". ఆ రకంగా బ్రాహ్మణుడు ముందుకు వచ్చాడు. అతను "బృందాలు తమ వైరుధ్యాలని పరిష్కరించుకోగలిగే అసమర్థత"ని వెల్లడి చేసే విధిని నిర్వర్తించాడు, తనే దైవాంశ సంభూతుడయేడు. సమాజంలో అట్టడుగున వుండే వ్యక్తి సోపాన శ్రేణిలో పైకి యెక్కిరాగలడు, కాని అందుకు నిబంధన యేమిటీ అంటే ఆ సాంఘిక వ్యవస్థను సొద్దు

లేకుండా అంగీకరించాలి. ఆ రకంగా "మతం మీద ఆధారపడిన యే సామాజిక ఉద్యమం అయినా అసంభవం" అయింది. యిక్కడనే వుంది హిందూమతానికీ, క్రైస్తవ మతానికీ మధ్య వున్న విభేదం.

పందొమ్మిదవ శతాబ్దంలో చాలామంది అభ్యుదయ భారతీయులు సంస్కరణ ప్రయత్నాలు చేశారు. రాజారామమోహనరాయ్ పథ నిర్దేశకుడు. తమ దేశస్థుల మనసుల్ని విశ్వాసాల సాలెగూళ్ళ నుంచి, ఆచారాల నుంచి, కర్మకాండల నుంచి విముక్తం చెయ్యడం తమ ప్రథమ కర్తవ్యంగా వాళ్ళు ప్రయత్నంచేశారు. కానైతే జాతీయ విమోచనోద్యమంతో అన్ని పార్శ్వాలనుంచీ హిందుమతం బలంగా పునరుజ్జీవనం పొందింది. అవి మంచివికానీ, చెడువికానీ. భారతదేశ మరో క్రైస్తవ ప్రతినిధి వీలెంగ అని వున్నాడు. ఆయన భారతీయ మార్క్సిజం గురించి దాపరికంలేని శోధన సాగించాడు. ఆయన దీనికీ, పునరుద్ధరణ మనస్తత్వానికీ మధ్య జరిగిన భావసంఘర్షణ గురించి పరిశీలించాడు. యీ అంశానికి సంబంధించి సూత్రీకరణప్రాయంగా అన్న మాటలు పామీదత్ రచనలో కనిపిస్తాయి. పామీదత్ బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీలో భారత విషయాల సిద్ధాంతవేత్త. రాజకీయాల గురించి సమకాలిక అవగాహనలేని నాయకులు జాతీయభావాన్ని "భారతదేశంలో వున్న సాంఘిక ఛాందసవాద విస్తారశక్తులమీద నిర్మించ చూశా"రనీ, ఆధునిక యూరప్ కంటే ప్రాచీన భారతంలో "వుందని చెప్పుకునే ఆధ్యాత్మిక ఆధిక్యం" మీద నిర్మించ చూశారనీ ఆయన రాశాడు. తిలక్, అరవిందఘోష్‌లాంటి వాళ్ళ గురించిన ప్రస్తావన చేశాడు. గోరక్షా సమితుల యేర్పాటు గురించీ, గణేశ ఉత్సవాల నిర్వహణ గురించీ, కాళీమాతలాంటి కాలదేవతల గురించీ ప్రస్తావించాడు. వాళ్ళు సర్వాత్మనా దేశభక్తులే, కాదనలేం. వాళ్ళే క్రియకు వచ్చేటప్పటికి, "సామాజిక తిరోగమనానికీ, మౌఢ్యానికీ, వర్ణ విభజనకీ, హోదా అంతస్తులకీ" జెండా యెత్తి పట్టిన వాళ్ళయేరు, అని ఆయన రాశాడు.

పునరుద్ధరణ జరిగిన హిందూమతానికి నూతన వాణిగా గాంధీని పరిగణించడం తప్పనిసరి. ఆయన రాజకీయ సమస్యల్ని మత పదబంధాల్లోకి తిప్పేడు. 'రామరాజ్యం' గురించి మాట్లాడేడు. అదొక కాల్పనిక స్వర్గం, కోరదగిందీనీ. పునః స్థాపించవలసిన స్వర్ణయుగం,

సోషలిజం కంటే. ఆయన యంత్ర నాగరికత వ్యతిరేకి అలాగే ఆధునికతకీనీ. గత కాలపు సరళ గ్రామీణ జీవితం వేపు మళ్ళాలన్నాడు. యిదంతా కూడా అసలైన భారతావని కామన అనీ, రైతాంగం ఆశ అనీ ఆయన భక్తులు భావించారని దత్ రాశాడు. కానైతే యదార్థానికి, "విస్తుపోయిన పెటీబూర్జువా వర్గపు" మధుర గతస్మృతి దర్శనం కంటే ఇది యెక్కువ కాదు. యీ పెటీ బూర్జువా వర్గం "నిర్దాక్షిణ్య ఆర్థిక పరిణామంతో దిక్కుతోచక, ప్రమాదం"లో పడిపోయినటువంటి సె. "ప్రాచీన భద్రత అనే శిలమీద కొంత సేదదీరుదా"మని వెంపర్లాడినటువంటిది. జవహర్‌లాల్ నెహ్రూ గాంధీ శిష్యుడు. మార్క్సిజం రంగు తగిలిన సోషలిస్టు. ఆయన యీ "దారిద్ర్యస్తవం"గా కనిపించిన దాన్ని చూసి దిమ్మెరపోయేడు. అది గతించిన కాలంనాటి అవశేషం అన్నాడు. "మానవాళికి లేమి పరిస్థితుల్లో మాత్రమే తోచినటువంటి" భావన అన్నాడు.

అయితే గాంధీ అస్పృశ్యుల తరపున పోరాడటానికి నడుం బిగించడం ద్వారా "సున్నితంగానే అయినా పటువు"గా ఛాందసవాదాన్ని కిందికి దించాడని నెహ్రూ పూరట చెందాడు. ఆ రకంగా గాంధీ వామపక్ష పడక కుర్చీ సిద్ధాంతవేత్తలకంటే యెంతో యెక్కువగా భారతదేశాన్ని కుదిపివేశాడనీ నెహ్రూ భావించాడు. గాంధీ రాజీలేకుండా వ్యతిరేకించడం వల్ల ఆయన హిందూమత కోరికల్ని ప్రతిఘటించడంవల్ల కమ్యూనిస్టులు దేశభక్తి పోరాటంలో ప్రధానవాహిని నుంచి గణనీయంగా దూరమయ్యేరు. ఐర్లాండ్‌లో సోషలిస్టుల మాదిరీ వేర్పాటు అయిపోయే గండం వాళ్ళకి సంభవించింది. స్వాతంత్ర్యం సిద్ధించాక కమ్యూనిస్టుల్లో చాలామంది, హీరేన్ ముఖర్జీలాంటివాళ్ళు మహాత్ముడి గురించీ భారతదేశానికి ఆయన చేసిన సేవల గురించీ పునర్ మూల్యాంకనం చెయ్యవలసి వచ్చింది. కానైతే గాంధీజీ తిరోగమన హిందూమతంతో సాదృశ్యం కావడం పెద్ద అవరోధం యెదురైంది. వాళ్ళ అనుమానాల్లో కొన్నైనా ముందస్తు హెచ్చరికగా రుజువయేయి. స్థానిక, జాతీయ ఎన్నికలలో కుల జాడ్యం గురించి స్వేచ్ఛాయుత భారతం గురించి బెటెల్‌హీమ్ జరిపిన సర్వే యెంతో తెలియజేస్తుంది. బహుళంగా వున్న ముస్లిం మైనారిటీలతో ఘర్షణ యింకా రాజుకుంటూనే వుంది.

మధ్య మధ్య సెగలు చిమ్ముతూనే వుంది. ఛాందసవాదులు పెద్ద గొంతుకతో అరిచే "భారత ఆత్మ" హిందూమత ఆత్మ తప్ప అన్యంకాదని నంబూద్రిపాద్ రాశాడు. "యీ సిద్ధాంతాన్ని భుజాన్న యెత్తుకుని మోసే వాళ్ళు హైందవేతరులు పరాయివాళ్ళు అన్న దురభిమానపూరిత హిందూమతంలోకి జారిపోతున్నారు" అని ఆయన అన్నాడు.

# ఆసియా సమాజం

మార్క్స్, ఎంగెల్స్‌ల సైద్ధాంతిక, ప్రయోగపూరిత పరిశీలనల్లో ఆసియా సమాజాల విశ్లేషణ కేంద్ర స్థానంలో లేదు. పందొమ్మిదవ శతాబ్దంలో వున్న పరిస్థితి అది. అయితే, ఆ తరవాత కాలంలో "ఆసియా సమాజాల" స్వభావం లేదా మరింత సాంకేతికంగా చెప్పాలీ అంటే ఆసియా తరహా ఉత్పత్తి విధానం అనేది మార్క్సిజంలో గణనీయ భావనాత్మక, రాజకీయ ప్రాముఖ్యం సంతరించుకుంది. (Asiatic mode of production - తెలుగులో ఎ.ఎమ్.పి. అని యిక్కడి నుంచీ వ్యవహరించుకుందాం). ఎ.ఎమ్.పి. గురించి సాగిన చర్చలు యెన్నో సమస్యల్ని లేవనెత్తాయి. అసలు మార్క్సిస్టు భావనలు యూరప్ బయట చెల్లుతాయా అన్న అంశం దగ్గర్నుంచి వర్గ సమాజం గురించి భౌతికవాద వివరణ స్వభావం దాకా, విప్లవాత్మక పరిణామం దాకా, ప్రపంచ చరిత్ర దాకా దాని ఔచిత్యం గురించి వాదాలు చెలరేగేయి. "ఆసియా సమాజం" అన్న భావనకి సంబంధించిన సమస్యాత్మక స్థాయిని నిశితమైన విచికిత్స అనే మాటల్లో సూచించవచ్చు. ఆసియా సమాజపు సామాజిక ఆర్థిక ప్రత్యేకత అనే దాన్ని గనక ఒప్పుకుంటే, అనూచానంగావున్న చారిత్రక పరిణామ పట్టిక గురించిన చరమ కారణ ఊహల్ని (అంటే బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ, సోషలిస్టు పరివర్తనాక్రమ వివరణలు) తప్పించుకోవాల్సి రావచ్చు. యేమైనా, ఎ.ఎమ్.పి. చెల్లుబాటు అంగీకరిస్తే మార్క్సిస్టులు ప్రాచ్య చరిత్రకంటే పాశ్చాత్య చరిత్ర ఓ మెట్టు పైన వుంటుందన్న దానికి వత్తాసు పలికినట్టు అవుతుంది. అప్పుడు పాశ్చాత్య దేశాల చలనశీల, పురోగామి స్వభావం, చలన రహిత తిరోగామి ప్రాచ్య దేశ స్వభావంతో పోలికే లేని తారతమ్యంతో వుంటుంది. అప్పుడు

"ప్రాచ్య నిరంకుశత్వం" గురించి తరతరాలుగావున్న అభిప్రాయాలనుంచి మార్క్సిస్టు అభివర్గాల్ని విభేదం చేసి చూపడం కష్టమవుతుంది. ఆసియా సమాజం నిర్నిరోధం, నిరంకుశం, చలనరహితం అని అనుకోవడం వలసవాదాన్ని సమర్థించడంగా తేలుతుంది. అంటే యెంత దురదృష్టకరమైనదైనా ఆంతరంగికమైన మార్పులకు బయటి జోక్యం అవసరం అన్న నిబంధన నెగ్గుకొస్తుంది.

మార్క్స్, ఎంగెల్స్‌లు 1853లో బ్రిటిష్ విదేశాంగ విధానాన్ని పత్రికలలో విమర్శిస్తూ రాశారు. దాని పర్యవసానంగా ఆసియా సమాజం గురించిన విశ్లేషణపట్ల వాళ్ళకి ఆసక్తి మొదటిసారిగా కలిగింది. వాళ్ళు "న్యూయార్క్ డైలీ ట్రిబ్యునల్"కు వ్యాసాలు రాశారు. అప్పుడు జేమ్స్‌మిల్ (హిస్టరీ ఆఫ్ బ్రిటిష్ ఇండియా 1821) ఫ్రాంకోయ్ బెర్నియర్ (వాయేజెస్ కాంటినాంట్ లా డెస్క్రిప్షన్ డెస్ ఎటాట్స్ డు గ్రాండ్ మొగల్ 1670), రిచర్డ్ జోన్స్ (ఏన్ ఎస్సే ఆన్ ద డిస్ట్రిబ్యూషన్ ఆఫ్ వెల్త్ అండ్ సోర్సెస్ ఆఫ్ టాక్సేషన్ 1831)ల ప్రభావం వాళ్ళ మీద పడింది. యివీ వాళ్ళకి దొరికిన ఆధారాలు. దాంతో ఆసియా సమాజంలో ఆస్తి స్వామ్యం లేకపోవడం, ముఖ్యంగా భూమిమీద సొంత స్వామ్యం లేకపోవడం, చలనరాహిత్యానికి ప్రధాన కారణం అని వాళ్ళు భావించారు. ఆసియా సమాజంలో వారసత్వ పోరాటాల వల్లా, సైనికదాడుల వల్లా రాజకీయ వ్యవస్థ మధ్య మధ్యలో మారుతూ వుండేది. దాంతో ఆర్థికవ్యవస్థలో మౌలిక మార్పులు యేమీ రాలేదు. అసలైన భూస్వామిగా వ్యవసాయ కార్యకలాపాలు, భూమిమీద స్వామ్యం ప్రభువు చేతిలో వుండడం వల్ల అలా జరిగింది. ఆసియా సమాజం నిలవనీరులా వుండిపోవడానికి ప్రాచీన గ్రామ సమాజం వ్యవసాయం, చేతివృత్తులు కలిసి ఆర్థికంగా స్వయం పోషకంగా వుండడం కూడా కారణం. యీ గ్రామ సమాజాలు భౌగోళిక, శీతోష్ణస్థితుల రీత్యా వ్యవసాయం మీద ఆధారపడి వుండేవి. అందుకు ఒక కేంద్రీకృత పాలనా వ్యవస్థ అవసరం అయింది. భారీస్థాయి నీటిపారుదల పనుల్ని ఆ వ్యవస్థ సమన్వయీకరించేది. ప్రజా కార్యక్రమాల విషయంలో ప్రభుత్వ ఆధిపత్యం, స్వయం పోషకత్వం, గ్రామ సమాజం బయటి లోకంతో సంబంధ బాంధవ్యాలు పెట్టుకోక పోవడం లాంటి కారణాలవల్ల నిరంకుశత్వం, చలన రాహిత్యం వచ్చి పడ్డాయి.

ఈ విధంగా ఆసియా సమాజం గురించి మార్క్స్, ఎంగెల్స్‌లు తొలి రచనల్లో రేఖా మాత్రంగా చెప్పుకొచ్చారు. ఆ తరవాత పరిణతి చెందిన రచనల్లో దీన్ని మరింత సవరించి విస్తరించేరు. ప్రాచ్య, పాశ్చాత్య దేశాలు పట్టణ నాగరికతలో కీలకమైన భేదాన్ని మార్క్స్ "గుండ్‌రిస్సె"లో గుర్తించాడు. వినిమయ విలువల పెరుగుదలకు స్థావరాలుగా రాజకీయంగా స్వతంత్రతవున్న నగరాలు ఫ్యూడలిజంలో వుండేవి. బూర్జువా వర్గం, పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందడానికి అవి కీలకం. మరి ప్రాచ్య దేశాల్లో నగరాలు ప్రభుత్వం చేసిన విశ్వామిత్ర సృష్టి. అవి వ్యవసాయానికి లొంగి వుండేవి. గ్రామీణ ప్రాంతం మీద ఆధారపడే వుండేవి. అదొక రకంగా "యువరాజు విడిదు"లు మాత్రమే. సమాజ ఆర్థిక నిర్మాణం మీద తెచ్చిపెట్టి రుద్దినటువంటివి. తరవాత మార్క్స్ స్వయంపోషక, నిరంకుశ గ్రామాల సమష్టి భూ యాజమాన్య స్వామ్యం మీద మరింత ప్రత్యేక ఊనిక పెట్టేడు. గ్రామాలే సామాజిక ఏకతకు పునాది. యిగ ప్రభుత్వంలో ప్రాతినిధ్యం వహించింది.

ఆ రకంగా ఎ.ఎమ్.పి. సామూహిక స్వాయత్తతలో ఒక రూపంగా కనిపించింది. సూత్ర రీత్యా యిలాంటిది ఆసియా బయటా సంభవించవచ్చు. ఎ.ఎమ్.పి. సామూహిక స్వాయత్తత పార్శ్వాన్ని ప్రతిబింబింపచేసే యిలాంటి వైఖరే "పెట్టుబడి"లోనూ కనిపిస్తుంది. అక్కడ మార్క్స్ ఆసియా గ్రామ స్వయం పోషకత్వం గురించి మళ్ళీ ప్రస్తావించాడు. వ్యవసాయం, చేతివృత్తులు ఐక్యంగా వుండడం గురించి ప్రస్తావించాడు. యిదే ప్రాచ్య నిరంకుశత్వానికి, సామాజిక చలన రాహిత్యానికీ పునాది. గ్రామ స్థాయిలో సరళ ఉత్పత్తివిధానం గురించి "పెట్టుబడి"లో వుంది. యీ విధానమే ఆసియా సమాజ జడత్వాన్ని వివరించే మౌలిక అంశం. "ఆసియా సమాజాల మార్పులేని స్వభావపు రహస్యం". యీ సమాజాల అదనపు ఉత్పత్తిని పన్నుల రూపంలో ప్రభుత్వం స్వాయత్తం చేసుకునేది. ఆ రకంగా భూమి శిస్తు, పన్ను సమసించాయి.

ఆసియా సమాజపు మౌలిక విశిష్టత యేమిటి అన్న విషయమ్మై గణనీయమైన చర్చే సాగింది - సొంత ఆస్తి లేకపోవడం, నీటిపారుదల వ్యవస్థమీద ప్రభుత్వ ఆధిపత్యం, గ్రామీణ స్వయం పోషకత్వం,

వ్యవసాయం చేతివృత్తులు ఐక్యం కావడం, ఉత్పత్తి పద్ధతుల సరళత - మార్క్స్, ఎంగెల్స్‌ల వివరణలలో యీ వైరుధ్య పూరిత అంశాల్ని, పాశ్చాత్య అభివృద్ధితో పోలిస్తే ఆసియా సమాజ జడత్వం యెలాంటిదో వివరించేందుకు, యెక్కడ వుంచాలి అన్నది యెదురవుతుంది. యూరోపియన్ ఫ్యూడలిజంతో, పెట్టుబడిదారీ విధాన అభివృద్ధికి దోహదపడిన అంశాల్ని గుర్తించి ప్రతికూలంగా యెక్కడ వుంచాలి అన్నది యెదురవుతుంది. ప్రాచ్య దృక్పథంలోనే ఆసియా సమాజం అతిగా పెరిగిన రాజ్య యంత్రాంగంతో సూచితమవుతుంది. అలాగే అర్ధ వికసిత పౌర సమాజమూ దీన్ని సూచిస్తుంది. యిదే యూరప్‌లో తలకిందులుగా వుంది. ఆసియా సమాజాల్లో బూర్జువా వర్గం ఆవిర్భవించడానికి అనువైన సామాజిక పరిస్థితులు లేవు. అంటే స్వేచ్ఛా వివరణలు, సొంత ఆస్తి, శ్రేణి నిర్మాణం, బూర్జువా చట్టం లాంటివి. యేమంటే కేంద్రీకృత ప్రభుత్వం పౌర సమాజం మీద ఆధిపత్యంతో వుంది. సొంత ఆస్తి లేకపోవడంతో సామాజిక పరిణామానికి ప్రతినిధులైన సామాజిక వర్గాలు అభివృద్ధి చెందడానికి వీలులేకపోయింది. గ్రామస్థాయిలో, నివసించేవాళ్ళందరూ పీడితవర్గం కిందనే లెక్క "సామాన్య బానిసత్వ" స్థితిలోనే బతుకుతూ వున్నారు. అయితే ఆసియా సమాజంలో యేది పెత్తందారీ వర్గమో గుర్తించి చెప్పడం కష్టం. వర్ణ వ్యవస్థ వుంది. దీన్ని మార్క్స్, ఎంగెల్స్‌లు వర్గ సంబంధాల ఆదిమ రూపంగా పరిగణించారు. చైనా, టర్కీ, పర్షియాల విశ్లేషణకు పనికిరాదు. సామాజిక పరివర్తనకు అవసరమైన అంతర్గత యంత్రాంగం లేకపోవడంతో, మార్క్స్ వివరణలో గర్భితమైన ఒక అంశం యేమిటంటే, యెంత అనుద్దిష్టమైనదైనా భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం, ఎ.ఎమ్.పి. ఛిద్రం కావడానికి దారితీసే బయటి శక్తి అయింది. బ్రిటిష్‌వాళ్ళు సొంతభూమి ఆస్తి సృష్టించడం ద్వారా, స్థాణువుగా వుండే ఎ.ఎమ్.పి.ని భారత సమాజంలో పేల్చివేసి విప్లవాత్మకం చేశారు అని మార్క్స్, ఎంగెల్స్‌లు "న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్" వ్యాసాల్లో అన్నారు. రైల్వే వ్యవస్థ, స్వేచ్ఛాయుత పత్రికలు, ఆధునిక సైన్యం, ఆధునికీకరించిన సమాచార వ్యవస్థ భారతదేశంలో సామాజిక అభివృద్ధికి అవసరం అయిన సంస్థాగత చట్రాన్ని అందించాయి. యీ వ్యాసాల ఆధారంగా ఒక వాదన తలెత్తింది (అవినేరి

1969.) అదేమిటీ అంటే బ్రిటిష్ సామ్రాజ్యవాదం గురించి మార్క్స్ చేసిన వివరణ ఒక అర్థాన్ని స్ఫురింప చేస్తుంది: సామ్రాజ్యవాద రూపాలు యెంత విస్తృతం అయితే అంత గాఢంగా ఆధునికీకరణ పర్యవసానాలు వుంటాయి. పైకి వెల్లడికాకపోయినా, సామ్రాజ్యవాద విస్తరణకు ఆసియా ప్రత్యేకత అంతిమంగా సమర్థనను అందిస్తుంది అన్నది. ఎ.ఎమ్.పి.కి బలమైన సైద్ధాంతిక అంతరార్థాలు వుండబట్టి, యీ ప్రత్యేక భావనను మూలమట్టం చెయ్యవలసిన అవసరం వుందని మార్క్సిస్టులు తరచూ వాదిస్తూ వుంటారు.

ఎ.ఎమ్.పి భావన యెన్నోసార్లు మూలమట్టంగా పడిపోయింది, మళ్ళీ పుంజుకుంది, మళ్ళీ కొత్త షోకులు చేసుకుంది. మార్క్స్ "ఎ కాంట్రిబ్యూషన్ టు ద క్రిటక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ" అన్న గ్రంథానికి రాసిన ముందుమాటలో ఎ.ఎమ్.పి. అనేది "సమాజ ఆర్థికాభివృద్ధిలో పురోగామి దశను సూచించే యుగాల్లో" ఒకటని పరిగణించాడు. కాని ఎంగెల్స్ "ది ఆరిజిన్ ఆఫ్ ద ఫేమిలి, ప్రైవేట్ ప్రాపర్టీ అండ్ ద స్టేట్" (1884) అన్న గ్రంథంలో దీన్ని గురించిన ప్రస్తావనే చెయ్యలేదు. యీ భావన ప్రాముఖ్యం రష్యాలో విప్లవ పోరాటల నేపథ్యంలో మళ్ళీ మార్క్సిస్టు చర్చల్లో వచ్చింది. రష్యన్ సమాజ స్వభావం గురించి అంచనా కట్టే విభిన్న భావనల్లో విభజన రాజకీయ వ్యూహాలు వున్నాయి. అది ఫ్యూడల్ సమాజమా, పెట్టుబడిదారీయా లేక ఆసియా తరహాదా అన్న విశ్లేషణలు వచ్చేయి. మార్క్స్ - ఎంగెల్స్‌లు జారిస్టు రష్యాని 1853లో అర్థ - ఆసియా తరహాదిగా ప్రస్తావించారు. రష్యన్ సమాజం వేర్పాటుగా వుంది అన్న భావనను ఏంగెల్స్ "యాంటీ డూరింగ్" (1877)లో ప్రాచ్య నియంతృత్వం ఆధారంగా, రూపొందించాడు. 1877 నుంచి 1882 దాకా మార్క్స్ "ఆతెస్పెలెన్నియే జపీస్కి" సంపాదక వర్గానికి, జసూలిచ్‌కి, ఎంగెల్స్‌కి యెన్నో ఉత్తరాలు రాశాడు. రష్యన్ సమాజ నిర్మాణం గురించి, విప్లవ సంభావ్యత గురించి తన అభిప్రాయాల్ని వాటిల్లో వివరించాడు. సమస్య యేమిటీ అంటే రష్యన్ సమాజం సోషలిజానికి పునాది అందించ గలదా లేక రాజకీయ అభివృద్ధికి అది సామాజిక ఆటంకాన్ని సూచిస్తుందా అని.

రష్యన్ సమాజం - పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు గ్రామీణ ప్రాంతంలోకి మరీ లోతుగా చొచ్చుకు పోనిది. అలాంటి రష్యన్ సమాజం సోషలిజానికి ఆధారాన్ని అందించ గలదు. యిదీ మార్క్స్, ఎంగెల్స్‌ల వాదం. దీనికితోడు మరో మాటా అన్నారు, రష్యాలో విప్లవం అంటూ వస్తే అది యూరప్‌లో శ్రామికవర్గ విప్లవాలతో సందర్భించి వుండాలి. విప్లవ వ్యూహాలకి సంబంధించిన చర్చల్లో "అర్థ - ఆసియా" సమాజంగా రష్యా సమస్య ప్రముఖంగానే వుంది. "రష్యన్ చరిత్ర గురించి కాల్పనిక దృక్పథం" బహుళ ఆమోదంగా వుంది. దాన్ని ప్లెహనోవ్ తిరస్కరించాడు. రష్యన్ గ్రామ సమాజం రష్యన్ నిరంకుశత్వానికి పునాది అని భావించాడు. ఎ.ఎమ్.పి. పునఃస్థాపనగా ప్రాచ్య నిరంకుశత్వానికి వాటంగా వుంటుందని భూమి జాతీయాకరణ ప్రతిపాదనల్ని ప్రతిఘటించాడు. చరిత్ర గురించిన నిశ్చిత ఏకోన్ముఖ దృక్పథానికీ, బహుముఖ దృక్పథానికీ మధ్య పోటీ అన్న సమస్య మీదనే ఆసియా సమాజం మీద చర్చలు వూగులాడేయి. బహుముఖ దృక్పథానికి ఎ.ఎమ్.పి. చెల్లుబాటు కీలకం. యేమంటే మార్క్సిజం యాంత్రిక పరిణామ పథకానికి కట్టుబడి లేదు అన్నభావం యిందులో వుంది. యిలాంటి పథకంలో చారిత్రక దశలు అవసర నియమాలకు అనుగుణంగా ఒకదాన్ని అనుసరించి ఒకటి వస్తాయి. ఏకోన్ముఖ పథకం- అంటే ఆదిమ కమ్యూనిజం, బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ, సోషలిస్టు దశలు - 1931 లెనిన్ గ్రాడ్ సమావేశం తరవాత ప్రాచుర్యంలోకి వచ్చింది. ఆ సమావేశం ఆసియా సమాజాల విశ్లేషణకు ఎ.ఎమ్.పి. ఔచిత్యం లేదని తిరస్కరించింది. ఆ నిర్ణయం, స్టాలిన్‌కివున్న యాంత్రిక ఏకోన్ముఖ దృక్పథం వల్ల ఖాయపడింది. ఎ.ఎమ్.పిని తిరస్కరించడం అంటే ఆసియా సమాజాలు బానిసత్వం లేదా ఫ్యూడలిజం అన్న వర్గీకరణల కింద తరవాత వచ్చి చేరడమే అవుతుంది.

యుద్ధానంతర కాలంలో ఆసియా సమాజం గురించిన చర్చ విట్‌ఫోగెల్ "ఓరియంటల్ డెస్పాటిజం" అన్న గ్రంథంతో ఉత్తేజం పొందింది. ప్రయోగాత్మకంగా విట్‌ఫోగెల్‌కి కావలసింది చైనా సామాజిక నిర్మాణంలో నీటిపారుదలవ్యవస్థ నిర్వహణకు కేంద్రీకృత నిర్వహణ అంతరార్థం. విట్‌ఫోగెల్ జల ఆర్థిక వ్యవస్థ గురించి తన గ్రంథం "విర్ట్

(స్క్రాఫ్ట్ ఉండ్ గెల్లెస్కాఫ్ట్ చైనాస్"లో అధ్యయనం చేశాడు. దీనికి సైద్ధాంతిక ప్రేరణ, చైనా చరిత్రకు "పైతృక ఆధిపత్యం" అన్న భావనను వెబర్ అనువర్తింప చెయ్యడం నుంచి వచ్చింది. విట్‌ఫోగెల్‌కి ఎ.ఎమ్.పి. భావన రెండు మౌలిక సమస్యల్ని ముందుపెట్టింది. మొదటగా యిది మనిషికీ ప్రకృతికీ మధ్య వున్న సంబంధం సమస్యను మొత్తంగా లేవనెత్తింది. నీటిపారుదలమీద ప్రజా ఆధిపత్యం ఉత్పాదక శ్రమ మౌలిక క్రమాల మీద గురి పెట్టినటు వంటిది. అది మానవ బృందాల్ని ప్రకృతికి అనుసంధిస్తుంది. దీనిమీద ఆధారపడి సామాజిక నిర్మాణాల "సాంస్కృతిక భూగోళశాస్త్రా"న్ని యిది అధ్యయనం చేస్తుంది. రెండవది, యిది మరో ప్రశ్నని ముందుపెడుతుంది: ఆధిపత్యవర్గం ఉత్పత్తి సాధనాల మీద స్వామ్యం లేకుండా మనగలిగే సమాజం వుండే అవకాశం వుందా? స్వామ్యం లేకుండా ప్రభుత్వ యంత్రాంగాన్ని చేతిలో పెట్టుకుని, ఆర్థిక రంగాన్ని అదుపులో ఒక అధికార వర్గంగా వుంచుకోవడం సాధ్యమేనా: విట్‌ఫోగెల్ తరవాత "ఓరియంటల్ డెస్పాటిజం" అన్న గ్రంథాన్ని 1957లో ప్రచురించాడు. "యావత్తు అధికారం గురించి తులనాత్మక అధ్యయనం"గా దాన్ని ప్రచురించాడు. కమ్యూనిస్టు నాయకత్వం 1931 తరవాత ఎ.ఎమ్.పి భావనను అణగ దొక్కిందని ఆయన వివాదంలో ఆరోపణ. అలా యెందుకు చేసిందీ అంటే సొంత ఆస్తి లేకుండా పాలనా సాధనాలని నియంత్రించే పాలకవర్గం అనే భావన జారిస్టు రష్యా నుంచి స్టాలినిస్టు రష్యా దాకా రాజకీయ అధికార అవిచ్ఛిన్నంగా వుందని సూచించడానికే. పార్టీ అధికార గణం సంప్రదాయిక అధికార గణాన్ని తొలగించింది కాబట్టి ఆసియా తరహా నిరంకుశత్వం నిలబడే వుంది.

స్టాలిన్ అనంతరం వచ్చిన పరిణామాలు 1960లలో ఎ.ఎమ్.పి. భావన తిరిగి పుంజుకోవడానికి దోహదం చేశాయి. ఆల్థూసర్ ప్రతిపాదించిన "నిర్మాణాత్మక" మార్క్సిజం ప్రోద్బలంతో ఉత్పత్తి విధానాల విశ్లేషణ చారిత్రక భౌతికవాద శాస్త్రీయ హోదాని పునరుద్ధాటించడంలో భాగం అయింది. విభిన్న ఉత్పత్తి విధానాలలోపల సంపద పోగుపడడం గురించి కచ్చితమైన సూత్రీకరణలు వచ్చాయి. అవి కరకు మార్క్సిస్టు ప్రత్యామ్నాయాన్ని చూపించాయి. ఆధునికీకరణకీ, సంప్రదాయిక సామాజికశాస్త్రంలో అభివృద్ధికీ సంబంధించిన సిద్ధాంతానికి యిది

ప్రత్యామ్నాయం. మార్క్సిజంలో మరింత సాధారణంగా కనిపించే ధోరణిలో ఎ.ఎమ్.పి. పట్ల ఆసక్తి ఒక పార్శ్వమే. యీ ధోరణివల్ల ఆధారపడడం భావన, ఎగుడుదిగుడు అభివృద్ధి, తగ్గుస్థాయి అభివృద్ధిలాంటి భావనలు వచ్చాయి. బాహ్యసీమ ఆర్థిక వ్యవస్థల్లో పెట్టుబడిదారీ విస్తరణ ఫలితాల్ని బోధ పరచు కోవడానికి యివి చెయ్యి అందించాయి. ఎ.ఎమ్.పి. యెక్కువగా ఏకోన్ముఖ దిశాభివృద్ధి దశల సిద్ధాంతానికి ఉపయోగకరమైన ప్రత్యామ్నాయంగా కనిపించింది. అదీగాక, బానిస విధానానికీ ఫ్యూడలిజానికీ ప్రత్యామ్నాయంగా, ఆసియా సమాజం భావాలు ప్రత్యేక అంశాలతో వున్నాయి, యివి ప్రాచ్య సమాజాల ప్రత్యేకతని గుర్తించాయి. యిలా అనుకూలంగా వివరణకు ఉపయోగ పడతాయని చెప్పుకునే సైద్ధాంతిక సౌకర్యాలమాట యెలా వున్నా, ఆసియా సమాజం, ఎ.ఎమ్.పి. అన్న భావన చిక్కుగానే మిగిలింది. ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో ఫ్యూడల్ ఉత్పత్తి విధానాన్ని అనువర్తింప చెయ్యడం విమర్శకు గురైంది. యిది మరీ అస్పష్టంగా వుందనీ, ప్రయోగాత్మక సంక్లిష్టతలో యిమడ్చడం కుదరదనీ, యీ ప్రాంతాల్లోని సమాజాల్లో వున్న వైవిధ్యాలకి సంబంధించి మరీనీ - అనీ విమర్శలు వచ్చాయి. ఆచరణకు వచ్చేటప్పటికి "ఆసియా సమాజం" భావం కూడా అంతే అస్పష్టంగా తయారైంది, మినహాయింపుల్లేకుండా చెప్పడం కష్టం అయింది. ఉదాహరణకు విట్‌ఫోగెల్ చెప్పిన అంశాలు చూడండి. అభివృద్ధిలోనూ, వ్యవస్థీకరణలోనూ అటో ధ్రువం, యిటో ధ్రువం సూచించే సమాజాలు వున్నాయి - జారిస్టు రష్యా, సుంగ్‌చైనా, మాత్‌ముక్ ఈజిప్టు, ఇస్లామిక్ స్పెయిన్, పర్షియా, హవాయ్ వగైరా వగైరా - యివన్నీ "జల సమాజాలు" అన్న ఏకైక భావన కిందకు వచ్చేస్తాయి. యిదే ధోరణిలో మార్క్స్ 'ఆసియా సమాజం' అన్న పదబంధాన్ని చైనా, భారతదేశాలకే కాక స్పెయిన్‌కి, మధ్య ప్రాచ్యానికి, జావాకి, కొలంబస్ పూర్వ అమెరికాకి సంబంధించి కూడా వాడేదు. మొత్తం మీద ఎ.ఎమ్.పి. అన్న భావన సామూహిక యాజమాన్యం పెట్టుబడిదారీ విపణి సంబంధాలు లేని స్వయంపోషక గ్రామాలు వున్న నానా గోత్రాలకీ అన్వయించేటట్టు వాడడం జరిగింది. ఆయా ఫలానా సమాజాలకు ఎ.ఎమ్.పి. భావనను అనువర్తింప చెయ్యడానికి అసంఖ్యాక

ప్రయోగాత్మక అభ్యంతరాలు వస్తే, ఎ.ఎమ్.పి. భావనే సైద్ధాంతిక సమస్యలతో చిక్కుకుని వుంది. ఉదాహరణకు, స్వయంపోషక, స్వయం ప్రతిపత్తి గల గ్రామాలకీ, గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో వేలుపెట్టి తీరవలసిన కేంద్రీకృత రాజ్యానికీ యెలా పొంతన కుదురుతుందన్న విషయం చిక్కుగానే వుంటుంది. అదీగాక ఆసియా సమాజపు సాంఘిక విశిష్టతలు వున్నాయి. అవి శుద్ధ సాంకేతిక అంశాల నుంచే వచ్చినట్టు కనిపిస్తాయి. యీ అంశాలు భారీస్థాయి నీటిపారుదల వ్యవస్థ వల్ల వచ్చినటువంటివిగాని ఉత్పత్తి సంబంధాల నుంచి వచ్చినటువంటివి కావు. ఆసియా సమాజం అన్న సిద్ధాంతంలో సాంకేతిక పరిజ్ఞాన నిర్ణాయకత అన్న వూహలు నిండివున్నాయి. అవి చారిత్రక భౌతికవాదంతో పొసగవు. చారిత్రక భౌతికవాదంలో సంబంధాలు ఉత్పత్తిశక్తుల్ని నిర్ణయిస్తాయి. యిక చివరగా, రాజ్యం పుట్టుక అనేది వుండనే వుంది. ఆసియా సమాజంలో యిది యెలా పుట్టుకొచ్చింది అన్నది అసంఖ్యాకమైన సమస్యల్ని తెచ్చిపెడుతుంది. వర్గపోరాటాలు లేకపోవడంవల్ల, రాజ్యం ఆవిర్భావం గురించి వివరించాలంటే దండయాత్రల పర్యవసానమనీ, ప్రజోపయోగ కార్యాలకి సంబంధించి దాని విధానాలనీ చెప్పుకోవాలంతే.

అయితే యీ సాంకేతిక విషయాలు సూచించే దానికంటే, యదార్థానికి "ఆసియా సమాజ" సమస్య యింకా యెక్కువ లోతైంది. మార్క్సిజంలో ఎ.ఎమ్.పి. భావనకు ప్రతికూల ప్రాముఖ్యమే వుంది. యేమంటే మార్క్సిజం సైద్ధాంతిక విధి ఆసియా సమాజాన్ని గురించి విశ్లేషించడం కాదు, ఒక తులనాత్మక చట్రంలో, యూరప్‌లో పెట్టుబడిదారీ విధాన ఆవిర్భావం గురించి వివరించడం. అందువల్లనే ఆసియా సమాజం గురించి అనేక అంతరాయాల క్రమంలో వివరించడం- మధ్యతరగతి లేకపోవడం, నగరాలు లేకపోవడం, సొంత ఆస్తి లేకపోవడం, బూర్జువా వ్యవస్థలు లేకపోవడం - వీటివల్ల యూరప్‌లో చలనశీలత వచ్చింది. ఆ రకంగా మార్క్సిజంలో ఆసియా సమాజం ప్రాచ్య సమస్య వ్యక్తీకరణగానే ఉంది. యీ తీగలాగితే హెగెల్, మాంటెస్క్యూ, హబ్స్, యిక గ్రీకు తత్వశాస్త్రం దాకా డొంక కదులుతుంది. మార్క్సిజం తరచుగా, నిరంకుశపాలన గురించి సాగే అనూచాన

వాగ్వివాదాల్లో, తెలియకుండానే ఆ పదబంధాల్ని భాషను వారసత్వంగా అందుకుంది. యీ భాష యూరపియన్ నియంతృత్వం మీద సాగిన చర్చల్లో రూపుతీసుకుంది. అంచేత "ఆసియా సమాజం" అనేదాన్ని ప్రాచ్య సంప్రదాయం లోపలవున్న కేంద్ర అంశంగా చూడాల్సి వుంది. యిది పాశ్చాత్య తత్వశాస్త్రంలో గణనీయమైన, ప్రమాదకరమైన, స్థితిస్థాపక శక్తి (resilence) కలిగివుంది.

# అదనపు విలువ

పెట్టుబడిదారీ విధానంలో దోపిడీకి వుండే ప్రత్యేక దారి అదనపు విలువను గుంజుకోవడం. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానపు "differentia specifica". యిందులో మిగులు లాభం రూపం తీసుకుంటుంది. దోపిడీ యెలా జరుగుతుంది? - యెలా జరుగుతుందీ అంటే శ్రామికవర్గం నికరంగా వస్తువును ఉత్పత్తి చేస్తుంది, దాన్ని వాళ్ళకిచ్చే వేతనం కంటే యెక్కువకు అమ్ముకోవడం జరుగుతుంది. ఆ రకంగా పెట్టుబడి నియోగించుకున్నప్పుడు మిగులు, అవసర శ్రమ తీసుకునే లాభం, వేతనాలు ప్రత్యేక రూపాలే. కానైతే లాభమూ, వేతనాలూ రెండు కూడా "డబ్బు"గానే వుంటాయి. ఆ రకంగా శ్రమ వస్తుగత రూపమే అవుతుంది. యిది చారిత్రకంగా నిర్దిష్ట మాధ్యమాలద్వారా మాత్రమే జరుగుతుంది, యిందులో అదనపు విలువ భావన కీలకం అవుతుంది.

పెట్టుబడిదారీ ఉత్పత్తి రూపం సరకు ఉత్పత్తి, నిజానికి అత్యంత సాధారణీకరించిన రూపం. ఉత్పత్తుల్ని విలువలకింద అమ్మడానికి ఉత్పత్తి చేస్తారు. యీ విలువల్ని ధర రూపంలో కొలిచి తీసుకుంటారు. అంటే డబ్బు పరిమాణాల్లో. ఉత్పత్తి పెట్టుబడిదారునికి చెందుతుంది. అతను ఉత్పత్తి క్రమంలో ఉన్న పెట్టుబడి విలువకీ, ఉత్పత్తి అయిన దాని విలువకీ మధ్యవున్న తేడాని అదనపు విలువగా పొందుతాడు. పెట్టుబడికి రెండు రూపాలున్నాయి. స్థిరపెట్టుబడి. యిది ఉత్పత్తి సాధనాల్లో యిమిడిన విలువకు తూగుతుంది. దీన్ని ఉత్పత్తి క్రమంలో ఉత్పత్తికే బదలాయించడం జరుగుతుంది. రెండవది అస్థిర పెట్టుబడి. దీన్ని

శ్రామికుల్ని నియోగించుకుందుకు వినియోగిస్తారు. శ్రామికులకు వాళ్ళు అమ్మేదాని విలువను చెల్లిస్తారు. అదే వాళ్ళ శ్రమశక్తి. అస్థిర పెట్టుబడిని అలా యెందుకు పిలుస్తారూ అంటే దాని పరిమాణం ఉత్పత్తి క్రమంలో ఆదినుంచి అంతందాకా మారుతూ వుంటుంది కాబట్టి. శ్రమశక్తి విలువగా ఆరంభమైంది, ఆచరణలో ఆ శ్రమశక్తి సృష్టించిన విలువగా అంతమవుతుంది. యీ రెండింటి మధ్యవున్న తేడాయే అదనపు విలువ. శ్రామికుడు ఉత్పత్తి చేసిన విలువను, పెట్టుబడిదారుడు అందుకు సమమైన వినిమయం అందించకుండా స్వాయత్తం చేసుకుంటాడు- యిక్కడ అన్యాయపూరితమైన వినిమయం లేదు. కానైతే పెట్టుబడిదారుడు- చెల్లింపు చెయ్యని శ్రమ మిగులు ఫలితాల్ని స్వాయత్తం చేసుకోగలుగుతాడు.

యిది యిలా యెందుకు సాధ్యమైందీ అంటే శ్రమశక్తి ఒక విలువ కనక. విలువను సృష్టించే సత్తావున్న అద్వితీయ ఆస్తి కనక. అంచేత యిది పెట్టుబడిదారీ ఉత్పత్తి ముఖ్యమైన దినుసు. ఉత్పత్తి క్రమంలో ఉత్పత్తి సాధనాలు కరిగిపోతాయి (వ్యయం అవుతాయి). వాటి ఉపయోగ విలువలు ఉత్పత్తి క్రమంలో సంగ్రహం అవుతాయి, ఉత్పత్తిగా నూతన రూపంలో తిరిగి దర్శనమిస్తాయి. వాటి విలువ పూరికే ఉత్పత్తి విలువకు బదలాయింపు అవుతుంది. శ్రమశక్తి కూడా ఉత్పత్తి క్రమంలో వ్యయం అవుతుంది. కాని శ్రమశక్తి వ్యయం శ్రమే. శ్రమకు జంట లక్షణాలు వున్నాయి. ఉపయోగమూ, నిరపేక్షమూ. యివి ఉత్పత్తి అయే వస్తువులో వుంటాయి. శ్రమశక్తి ఉపయోగ విలువకి ద్వంద్వ స్వభావం వుంది: శ్రమశక్తికి ఉపయోగ విలువల్ని సృష్టించే విలువా (ఉపయోగకరమైన శ్రమ), ఉపయోగ విలువకు విలువను సృష్టించగలిగే సత్తా (నిరపేక్ష శ్రమ) వుంటాయి. యిదుగో యీ రెండవదే పెట్టుబడిదారునికి ఆసక్తి కలిగించేది. శ్రమశక్తి వ్యయం అయేటప్పుడు కొత్త విలువ ఉత్పత్తి అవుతుంది. అప్పుడు యీ నూతన విలువ, నియోగించుకున్న శ్రామికుల శ్రమ విలువకంటే యెక్కువ వుంటుందన్న ఆశతోనే వాళ్ళని అలా పెట్టుకోవడం జరుగుతుంది. శ్రామికవర్గంలో శ్రమశక్తి తప్ప మరేమీ సొంతంగా లేనివాళ్ళే వుంటారు. శ్రామికులకి వేరే ఉత్పత్తి సాధనాలు యేమీ అందుబాటులో లేకపోవడం వల్లా, బతకడానికి యేదో ఒకటి

అమ్ముకోవాల్సి వుండడం వల్లా, వాళ్ళు తమ శ్రమశక్తిని అమ్ముకు తీర వలసిందే. వాళ్ళు విలువను సృష్టించే దాని ద్రవ్యాన్ని తామే వాడుకోలేరు. అంచేత శ్రామికుల దోపిడీ శ్రమ విపణిలో అసమ వినిమయం వల్ల జరగడం లేదు, యేమంటే వాళ్ళు తమ శ్రమను దాని విలువకు అమ్ముకుంటున్నారు. కాని యిది పెట్టుబడిదారీ ఉత్పత్తి క్రమంలో ప్రవేశించ వలసివున్న వర్గ స్థానంవల్ల జరుగుతుంది. అక్కడ, అసలు దోపిడీ సంభవిస్తుంది. మరే యితర స్వేచ్ఛాయుత వినిమయ ఒప్పందాల్లాగానే, వ్యక్తిగత వేతన శ్రమ ఒప్పందం కూడా భాగస్వాముల్లో యే ఒక్కరిమీదా రుద్దినటువంటిది కాదు. అయినాగానీ శ్రామికులు శ్రమశక్తిని అమ్ముకో నక్కర లేనట్టు స్వేచ్ఛగా వుండలేరు, యేమంటే వాళ్ళకి బతకడానికి వేరే దారి లేదు. ఆ రకంగా, యీ స్వేచ్ఛ వ్యక్తిగత వేతన ఒప్పందం స్థాయిలో యదార్థంగా వున్నట్టే కనిపించి నప్పటికీ, క్రియకు వచ్చేటప్పటికి, మార్క్స్ చెప్పినట్టు రెండు ముఖాల స్వేచ్ఛగా తయారవుతుంది. తమ శ్రమశక్తిని అమ్ముకునే స్వేచ్ఛ లేదా ఆకలికి మలమల మాడే స్వేచ్ఛ.

ప్రామాణిక అర్థశాస్త్రం గురించి అంతకు ముందటి రచయితలు రాసిన వాటికీ, అదనపు విలువ గురించి మార్క్స్ విశ్లేషణకీ గణనీయమైన భేదం వుంది. ప్రామాణిక అర్థశాస్త్రవేత్తలు, ముఖ్యంగా రికార్డోలాంటి వాళ్ళు, అదనపు విలువ అనేది శ్రమ అన్యాయపూరిత వినిమయం నుంచి వస్తోందని అభిప్రాయపడ్డారు. కార్మికుని వేతనానికీ, పెట్టుబడిదారునికీ మధ్య యీ అసమతూకం వుండడం వల్ల అలా జరిగిందని అభిప్రాయపడ్డారు. కార్మికులు శ్రమ విలువకంటే తక్కువగానే దాన్ని అమ్ముకోక తప్పనిసరి అవుతుంది. ఆ రకంగా వినిమయంలో అదనపు విలువ పుట్టు కొస్తోంది. అయితే మార్క్స్ - శ్రమకీ, శ్రమశక్తికీ మధ్య తేడా చూశాడు. దాంతో, యే అన్యాయపూరిత వినిమయం లేకుండానే శ్రమశక్తిని దాని విలువకు అమ్మవచ్చునీ, ఉత్పత్తిలో అదనపు విలువ ఉత్పన్నం కావచ్చునీ ఆయన దర్శించగలిగేడు. ఆ రకంగా పెట్టుబడిదారీ దోపిడీ, అంతకుముందు వున్న ఉత్పత్తి విధానాల్లో మాదిరీ, ఉత్పత్తి క్రమంలోనే జరుగుతుందనీ, ధర్మబద్ధ వినిమయ రేట్లు దానికి అంతం కాదనీ వివరించాడు. పీడితునికీ పీడకునికీ వున్న స్థానాలు వర్గ స్థానాలు.

యీ విషయం ఉత్పత్తి సాధనాల స్వామ్యం బట్టి తెలుస్తుంది (వ్యక్తిగత ఆదాయం, వక్తిగత వినిమయ ఒప్పందాల ఫలితంగా కంటే; యిలా అని నయా ప్రామాణిక అర్థశాస్త్రం తరవాత ప్రకటించుకున్నట్టు)

విలువలు పరిమాణాలు అవడంబట్టి, అదనపు విలువ మొత్తాలూ పరిమాణాలే. ఒక శ్రామికుడు ఉత్పత్తిచేసే అదనపు మొత్తం ఆ కార్మికుడు ఉత్పత్తి చేసే విలువకీ, ఆ కార్మికుని శ్రమశక్తికీ మధ్య వున్న అంతరమే. మొదటిది ఆ ఫలానా శ్రామికుడు వున్న శ్రమ క్రమం పరిస్థితుల బట్టి నిర్ణయం అవుతుంది, అలాగే ఉత్పత్తికి వున్న మార్కెట్‌ని బట్టీనీ శ్రమశక్తి అన్నది విడి శ్రమ క్రమం బయట, శ్రమ మార్కెట్ పరిస్థితుల్ని బట్టీ, శ్రామికుడు వినియోగించుకొని తీరవలసిన వస్తువుల విలువను బట్టీ నిర్ణయమవుతుంది. విలువ సూత్రం ప్రకారం శ్రామికులు ఉత్పత్తి చేసిన విలువ, అంటే విభిన్న పరిశ్రమల్లో, ఒకే రకంగా వుండేటట్టు మొగ్గు వుంటుంది. శ్రమ మార్కెట్‌లో పోటీ, శ్రమశక్తికి ఏకరీతి విలువ వుండేటట్టు మొగ్గు చూపుతుంది, కనీసం నైపుణ్యం లేని శ్రమకు సంబంధించి ఆ రకంగా ఒక ఆర్థిక వ్యవస్థలో అదనపు విలువ ఉమ్మడి రేటు గురించి మనం చెప్పుకోగలం. అక్కడ అదనపు విలువ రేటు (కొన్ని సందర్భాల్లో దోపిడీ రేటుగా కూడా పిలిచేటువంటిది) యీ నిష్పత్తుల్లో నిర్వచించుకోవచ్చు:

$$\text{అదనపు విలువ} = \frac{\text{ఉత్పత్తి అయిన అదనపు మొత్తం}}{\text{పెట్టిన అస్థిర పెట్టుబడి}}$$

నైపుణ్యం లేని శ్రమకు ద్విగుణీకృతంగా నిపుణ శ్రమను పరిగణించినట్లయితే గనక, వాళ్ళు అందుకున్న అదనపు జీతానికి ఆ నిష్పత్తిలో విలువను ఉత్పత్తి చేస్తారు. అప్పుడు నిపుణ కార్మికులలో కూడా అదనపు విలువ రేటు స్థిరంగానే వుంటుంది.

ఏమంటే కార్మికుడు ఉత్పత్తిచేసిన విలువ యీ రకంగా విభజించగలం గాబట్టి, అలాగే ఆ విలువను సృష్టించడానికి కార్మికుడు పెట్టే సమయాన్ని విభజించవచ్చు. ఆ రకంగా పని దినాన్నీ విభజించవచ్చు, దాన్ని రెండు భాగాలుగా చెయ్యవచ్చు: అవసరమైన శ్రమ - యిందులో పనిచేసేవాడు తను అందుకునే జీతానికి సమం

అయిన పనిచేస్తాడు. అదనపు శ్రమ - యిక్కడ కార్మికుడు వూరికే పెట్టుబడిదారుని కోసమే పనిచేస్తాడు. నిర్వచన రీత్యా యీ రెండు భాగాల్నీ యెలా విభజించవచ్చునంటే: అదనపు విలువ రేటు,

$$\text{అదనపు విలువ} = \frac{\text{అదనపు శ్రమ}}{\text{అవసరమైన శ్రమ}}$$

కార్మికుడు పనిచేసే

$$\text{పని గంటలు} = \frac{\text{పెట్టుబడిదారు కోసం పనిచేసే గంటలు}}{\text{సొంత వినిమయం కోసం చేసే పనిగంటలు}}$$

పెట్టుబడిదారీ ఉత్పత్తి చరిత్రను యిలా చూడవచ్చు: యిదొక పోరాట చరిత్ర - పెట్టుబడి పెరగాలని చూస్తుంది, శ్రామికవర్గం అదనపు విలువరేటు పెరగడాన్ని ప్రతిఘటిస్తుంది. యీ రెండింటికీ మధ్య యిదే పోరాటం. యిది రెండు ప్రధాన పద్ధతుల్లో జరిగింది. మొదటిదాంట్లో నిరపేక్ష అదనపు విలువ సంగ్రహణం - అదనపు విలువను పెంచడం, ప్రతి శ్రామికుడు అవసరమైన శ్రమమొత్తాన్ని మార్చకుండానే, ఉత్పత్తి చేసిన మొత్తం విలువను పెంచడం ద్వారా, పని దినాన్ని ముమ్మరం చెయ్యడం ద్వారా, లేదా విస్తరించడం ద్వారా గాని యిలా చెయ్యచ్చు. యిందులో యెలా చేసినా సంఘటిత ప్రతిఘటన వస్తుంది. రావడమే కాదు శారీరక పరిమితుల్నీ అందుకుంటుంది. యేమంటే పెట్టుబడిదారీ వర్గం మొత్తంగా ఆధారపడిన (విడి పెట్టుబడిదారు కాకపోయినా) వర్గం ఆరోగ్యం, దీర్ఘ పని గంటలవల్ల క్షీణించిపోతుంది. శ్రమ అతి ముమ్మరం కావడం, అరకొర జీతాలు యిలా చేస్తాయి. ఆ రకంగా బ్రిటన్‌లో 1847లో శ్రామికవర్గ సంస్థలు, ప్రజాహిత పెట్టుబడిదార్లు, స్వల్పకాలికం కాకుండా దీర్ఘకాలిక పెట్టుబడి ప్రయోజనాలు కలగలిసి పదిగంటల పని దినం చట్టం వచ్చేటట్టు చెయ్యడం జరిగింది. (పెట్టుబడి 1, అధ్యాయం - 10, ముఖ్యంగా విభాగం 6.)

నిరపేక్ష అదనపు విలువని గుంజుకోవడం ఓ అంచుకు చేరుకోగానే, ప్రతి కార్మికుడు ఉత్పత్తిచేసే మొత్తం విలువను పెంచడానికి ప్రత్యామ్నాయం వస్తుంది. అదే పరిమాణాన్ని పెట్టుబడికి మరింత అనుకూలంగా వుండేటట్టు భాగాలుగా విభజించు కోవడం. అంటే అదే

పనిదినం వుంటుంది, పెట్టుబడి స్వాయత్తం చేసుకోగలిగేటట్లు అదనపు విలువగా మరింత అందుబాటులో వుండేటట్టు దాన్ని తిరిగి విభజించుకోవడం జరుగుతుంది. దీనికి, అవసరం అయిన తగ్గడం కావాలి, అంటే శ్రమశక్తి విలువలో తగ్గుదల. యిది సాపేక్ష అదనపు విలువను గుంజు కోవడం అవుతుంది. యిది రెండు విధాలుగా జరుగుతుంది. శ్రామికుడు వినియోగించుకునే ఉపయోగ విలువల్ని గాని, అదే ఉపయోగ విలువల పరిమాణాన్ని ఉత్పత్తి చేయడానికి సామాజికంగా అవసరం అయిన శ్రమ కాలాన్ని గాని తగ్గించెయ్యాలి. మొదటి దాంట్లో నిరపేక్ష అదనపు విలువను గుంజు కోవడంలో వున్న ఆ పరిమితులే యెదురవుతాయి: శ్రామికవర్గ ప్రతిఘటన, దాని శారీరక పరిస్థితులు దిగజారడం. యిక రెండవ పద్ధతి వుంది. దీని ద్వారానే యివాల్టికీ, పెట్టుబడిదారీ విధానం అత్యంత చలనశీలంగా వుంది. అది ఉత్పత్తి పద్ధతుల్ని నిరంతరంగా మార్చు కుంటూనే వుంది. సాంకేతిక పరిజ్ఞాన నైపుణ్యాల్ని ప్రవేశపెడుతూనే వుంది. యేమంటే సాంకేతిక మార్పుల వల్లనే ఆ ఫలానా వస్తువుల ఉత్పత్తిలో సాంఘికంగా అవసరం అయిన శ్రమ కాలాన్ని తగ్గించవచ్చు. ఉత్పత్తి నూతన పద్ధతులద్వారా వచ్చిన [illegible] ఉత్పాదకత - యిందులో యంత్రాల రూపంలో మృత శ్రమ సజీవశ్రమ టూపం తీసుకుంటుంది కదా - ఉత్పత్తి అయిన విడి వస్తువుల విలువను తగ్గిస్తుంది. శ్రమ శక్తి విలువలో ప్రతిఫలించే వస్తువుల విలువకు దీన్ని అనువర్తింప చేస్తే - అంటే శ్రామికుల వినిమయంలో భాగం అయే వస్తువులకు - శ్రమ విలువ పడిపోతుంది, పనిదినంలో మరింత హెచ్చు నిష్పత్తిని అదనపు విలువకు అర్పించవచ్చు.

సాపేక్ష అదనపు విలువను పోగేసు కోవడం పెరిగిన ఉత్పాదకత సదుపాయాల్ని పంచుకోవడం ద్వారా వస్తుంది. ఓ విభాగంలో ఉత్పత్తి అయిన వస్తువులు శ్రామికులే వినిమయం చేసుకోవడం అన్ని కేంద్రాల్లోనూ వున్న సదుపాయమే. యిలా పంచుకోవడం అనేది చలామణీ క్రమం ఫలితం, పెట్టుబడిదారీ పోటీ ఫలితం. ఆ విధంగా కొత్తగా, నడుం కట్టిన పెట్టుబడిదారుని అదనపు లాభాలు క్రమేణా హరించుకు పోతాయి. యేమంటే ఉత్పత్తి అయిన దాని విలువ, పోటీదార్లు నూతన నైపుణ్యాల్ని అనుసరించి నప్పుడు తగ్గిపోతుంది. యీ

కొత్త పుంత వేతన సరకుల ఉత్పత్తి పరిశ్రమలో వున్నట్లయితే, ఆ సదుపాయాల్ని అన్ని కేంద్రాల్లోనూ సమంగా పంచుకోవడం జరుగుతుంది. తగ్గిన శ్రమశక్తి విలువ రూపంలో వుంటుంది. ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి అయితే అవి క్రమేణా శ్రామికుల వినిమయ వస్తువుల ఉత్పత్తిలోకి పోతాయి. అప్పుడు యిదే ప్రభావం యిలాగే వుంటుంది. యేమంటే వేతన వస్తువుల విలువా అదే రకంగా తగ్గిపోతుంది. అలాగాక పెట్టుబడిదారుని వినియోగం కోసమే ఉత్పత్తి చేసే పరిశ్రమలోనో, లేదా ఆ విభాగంలో మాత్రమే ఉపయోగం వున్న ఉత్పత్తి సాధనాల ఉత్పత్తిలోనో ఆ నూతన ధోరణి వుంటే గనక అదనపు విలువ రేటులో యే మార్పూ లేకపోవడమే చివరగా తేలేది. యేదో కొన్ని భోగవస్తువుల ధరలలో వూరికే కొంత తరుగుదల వుంటుందంతే.

ఆ రకంగా సాపేక్ష అదనపు విలువను తీసుకోవడం అనేది పెట్టుబడిదారులకి సంబంధించి ఉద్దేశ పూర్వకంగా సాగే క్రమం కాదు. పెట్టుబడిదారుల లక్ష్యం తమ విడి ఖర్చుల్ని తగ్గించు కోవడం, తమ లాభాల్ని పెంచుకుందుకు అలా చెయ్యడం మాత్రమే. పోటీలో వాళ్ళ ప్రత్యర్థులమీద తక్షణం పొందే లాభాల్ని వదులుకోవడం, ఆ లాభం అన్ని కేంద్రాల మధ్యా విస్తరించిన యే లాభమేనా గానీ. అంతిమ ఫలితం సాపేక్ష విలువను గుంజుకోవడం అవునోగానీ – అంటే, శ్రమశక్తి విలువ మీదా ఉత్పత్తిపై ప్రభావం వున్నది కావచ్చు – అది విడిగా నూతన పుంతలు తొక్కే పెట్టుబడిదారునికి పట్టదు. యెటొచ్చియెటు బోయినా పోటీ శక్తులు అతన్ని నిర్బంధిస్తాయి. క్రమేపీ అతను వ్యక్తిగత లాభాలన్నిట్నీ నష్టపోతాడు.

పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో అభివృద్ధి చరిత్రలో చాలాభాగం నిరపేక్ష, సాపేక్ష అదనపు విలువల్ని గుంజుకోవడం క్రమాలనుంచే పరిశీలించవచ్చు. (ఉదాహరణకు చూడండి, ఫైన్, హారిస్ 1979, హిమ్మెల్‌వీట్ 1979) నిరపేక్ష అదనపు విలువ పెట్టుబడిదారీ అభివృద్ధి తొలి దశల్లో విశిష్ట అంశంగా వుంది, అయినా యీ రెండూ ఒకదానితో ఒకటి కలిసే సాగుతాయి. సాంకేతిక మార్పులతో సాపేక్ష అదనపు విలువను గుంజు కోవడం జరుగుతుంది. నిరపేక్ష అదనపు విలువ గుంజు కోవడానికి పునాది అది వేస్తుంది. నిరపేక్ష సాపేక్ష అదనపు

విలువల్ని రెండింటినీ పొందే క్రమాల కలయికగా చాలా క్రమాల్ని విశ్లేషించవచ్చు; ఉదాహరణకు వివాహిత స్త్రీలు వేతన ఉద్యోగాలలో ప్రవేశించడం వల్ల అదనపు విలువ పొందే రెండింటినీ సాధ్యం చేసింది. యేమంటే వాళ్ళవి తక్కువ వేతనాలు. అవి తక్కువ వ్యక్తిగత శ్రమశక్తి విలువను తెలియజేస్తాయి. కాని యిదే సమయంలో అది నిరపేక్ష అదనపు విలువకు రంగం సమకూరుస్తాయి. యేమంటే మరింత విలువను సృష్టించే శ్రమను కుటుంబం మొత్తం చేస్తోంది. పునరుత్పత్తి ఖర్చుల పెరుగుదలలో తదనురూపంగా పెరుగుదల లేకుండానే అలా చెయ్యడం జరుగుతుంది. ఆ రకంగా, పెట్టుబడి చెల్లించ వలసిన అవసర శ్రమ పరిమాణం పెరుగుదలతో వుంటుంది.

# స్త్రీవాదం

మార్క్సిస్టు చింతనలో స్త్రీవాదం అనేది వాదోపవాదాల అంశంగా వుంది. ఒక్క పక్క స్త్రీవాదం - పురుషులతో స్త్రీల సమానత్వం అనేవిషయంగా చూడ్డం ప్రధానంగా ఉదారవాద, వికాస యుగ సిద్ధాంతంగా కనిపిస్తుంది. ధానికీ విప్లవకర మార్క్సిజానికీ సంబంధం లేదు. అటు పక్క స్త్రీలని పీడన నుంచీ, దోపిడీ నుంచీ విముక్తం చెయ్యడం అనేది మానవ విమోచనలో భాగంగానే చెయ్యడం జరుగుతుందనీ సోషలిస్టు విప్లవం మాత్రమే దాన్ని సాధించగలదనీ అనడం వినిపిస్తూ వుంది.

స్త్రీవాదంలో చారిత్రకంగా ప్రత్యేక ధోరణుల్ని గుర్తించడం నిస్సందేహంగా సవ్యమైంది. గ్రేట్ బ్రిటన్, యు.ఎస్.ఎ. లలో సంప్రదాయం ప్రజాస్వామికంగా, ఉదారంగా వుంది; సమాన హక్కులు పొందడం దిశగా, స్త్రీలకి సమానత్వం సాధించడం దిశగా నడిచింది. 19వ శతాబ్దంలో యీ కృషిలో యెక్కువ భాగం విద్యాపర, వృత్తిపర అవరోధాల్ని తొలగించడం మీద లగ్నం అయింది. కాని యీ సంస్కరణాత్మక ప్రచారాల వెనక చోదకశక్తి యెక్కువగా సమరశీల తత్వంతో వుంది. "సమాన హక్కుల" సమరశీలతత్వం, యిరవయ్యో శతాబ్దం తొలిభాగంలో వోటు హక్కు కోసం పోరాటం చేసే స్త్రీల

తీవ్రమైన పోరాటాలతో పతాక స్థాయిని చేరుకుంది. స్త్రీవాదం యిటీవలి కాలంలో సాధించిన విజయాల్లో బ్రిటిష్ సమాన వేతనం స్త్రీ పురుష వివక్ష చట్టం. దీనికి సమానంగా వున్న యు.ఎస్.ఎ విజయాలు. సాంఘిక విధానంలో యెన్నో సంస్కరణలు, ఉద్యోగాలు వగైరాల కోసం యిప్పుడు పోరాటాలు సాగుతున్నాయి.

స్త్రీవాదంలో మరో ప్రముఖ సంప్రదాయమూ వుంది. స్వభావ రీత్యా అది మరింత "వేర్పాటుగా" వున్నట్టు గుర్తించారు. స్త్రీవాద ఊహా స్వర్గాలు యెక్కువగా మహిళా సమాజాల్ని చిత్రించుకున్నాయి. అక్కడ పురుషులకి వుండే తీవ్రవాద, సైనిక పూరిత, హెచ్చుతగ్గుల, పెత్తందారీ లక్షణాలు యెంతగానో అదృశ్యం అయివుంటాయి. యీ బాపతు స్త్రీవాద ఆలోచనా పాయ పురుష పాశవికత్వాన్ని బాగుచెయ్యడం గురించి నిరాశాపూరిత ధోరణివేపు మొగ్గుతుంది. స్త్రీలు ఒకళ్ళతో ఒకళ్ళు సంబంధాల్ని బలోపేతం చేసుకోవాలని సూచిస్తుంది. చారిత్రకంగా యీ స్త్రీల మధ్య సంబంధాల్లో ప్రణయ సంబంధమైన వాటికంటే, అనుభూతి పూర్వకమైనవి యిమిడి వుంటాయి. కాని ప్రత్యేక స్త్రీవాద సమకాలీన వారసులలో మాదిరి యీ విషయం కూడా తక్కువ సర్దుబాటు వైఖరినీ, గౌరవప్రదమైన వైఖరినీ తీసుకుంటుంది. యివాల్టి స్త్రీ విమోచనా ఉద్యమం గ్రేట్ బ్రిటన్లో, యు.ఎస్.ఎలో 1960ల ఉత్తరార్థంలో రూపుతీసుకుంది. (ఫైర్‌స్టోన్, మిలెట్ లాంటి వాళ్ళ తొలి ప్రామాణిక గ్రంథాల్లో ప్రతిబింబించింది). యిది దాని రాజకీయ ప్రభావాన్ని, పురుష పాశవికత్వం మీద రాజీలేని విమర్శ నుంచి గ్రహించింది. (శారీరక, మానసిక) అలాగే పురుష అధికారం మీద (ఆర్థిక, రాజకీయ, సైనిక) రాజీలేని విమర్శ నుంచి గ్రహించింది. పురుషాధిక్యత (పితృస్వామ్యం) ప్రాథమిక సాంఘిక విభజన, వర్గంకంటే జాతికంటే మరింత ప్రాముఖ్యం వున్నటువంటిది.

ఇక స్త్రీవాదంలో మూడవ పాయ స్త్రీల విమోచనా పోరాటాన్ని మరింత సాధారణ సోషలిస్టు దృక్పథానికి, రాజకీయాలకీ అనుసంధిస్తుంది. యిక్కడ ఒక ముఖ్య విషయాన్ని గమనించాలి. యివాళ గ్రేట్ బ్రిటన్‌లోని మహిళా ఉద్యమం మీద మార్క్సిస్టు, లెనినిస్టు సంప్రదాయపు రాజకీయ ప్రభావం తక్కువనే చెప్పాలి. యిక్కడి ఉద్యమం

వ్యూహాజనిత సోషలిజంతో, ఉదారతత్వంతో, మావో సిద్ధాంతాలతో, వలసవాద వ్యతిరేకతతో, అరాచక సిద్ధాంతాలతో ప్రభావితం అయింది. ఉదాహరణకు "చైతన్యం కావించడం" అనేది స్త్రీవాదంలో ముఖ్యమైన వ్యూహం. ఫానన్, మావోసేటుంగ్‌ల ప్రభావం దీనికి అధికం. యీ ప్రత్యేక సోషలిస్టు సంప్రదాయాలు భావజాలం, చైతన్యం, సాంస్కృతిక విప్లవంలాంటి సమస్యల్ని ప్రధానంగా తీసుకోవడం యెంత మాత్రం ఆశ్చర్యకారకం కాదు.

ఇంతకీ అసలు మార్క్సిస్టు చింతనలో స్త్రీవాదం స్థానం యేమిటి? మార్క్స్ సిద్ధాంతాల గురించి యెన్ని వ్యాఖ్యలు వున్నాయో అన్ని జవాబులూ యీ ప్రశ్నకీ వున్నాయి. న్యాయం, సమానత్వం, యువ మార్క్స్ రచనల్లో కనిపించే పరాయీకరణ సిద్ధాంతంలో వున్న స్వయం పరిపూర్ణత లాంటి అన్నిటితో స్త్రీవాదం సమసిస్తుంది. పరిణతి చెందిన "పెట్టుబడి" రచన నాటి మార్క్స్ పెట్టుబడిదారీ విధాన చలనశీలత గురించి చేసిన వివరణాత్మక విశ్లేషణలో స్త్రీ సమస్య పరిశీలనకు అవకాశం యెందుకు వదిలాడో చెప్పడం కష్టం. సామాన్యంగా మార్క్స్ గురించి చేసే మానవత్వ పూర్తి టీకాటిప్పణులు మానవ వ్యతిరేక వైఖరులకంటే యెక్కువగా స్త్రీవాదంతోనే సమసిస్తున్నట్టు మొగ్గు చూపుతాయి. యిటీవలి కాలంలో, యేమైనప్పటికి, ఆల్తూస్సర్ అనుయాయులు ఒక వాదం చేశారు (మానవ - వ్యతిరేక స్థానం నుంచి). స్త్రీల పట్ల వ్యతిరేకతను పెట్టుబడిదారీ పునరుత్పత్తి అవసరాల రీత్యా (కుటుంబం ద్వారా) శ్రమశక్తి, ఉత్పత్తి సామాజిక సంబంధాలు అనే కోణం నుంచి అర్థం చేసుకోవచ్చని అంటారు. అయితే యీ వాదనలు అంత సమంజసంగా కనిపించవు. అవి పెట్టుబడిదారీ విధానం ఒక వ్యవస్థగా, ఒక దృగ్విషయంగా (స్త్రీల అణచివేత) దాని అవసరాల రీత్యా యిలా చేస్తుందన్నదే కాదు. యీ అణచివేత అన్ని ఉత్పత్తి విధానాల్లోనూ వున్నదే.

మార్క్సిస్టు చింతనకీ, స్త్రీవాద చింతనకీ, రాజకీయ ఆచరణకీ మధ్య గుర్తించదగ్గ ఉద్రిక్తత వున్నమాట నిజం. మార్క్స్ తన రచనల్లో స్త్రీవాదానికి అంత ప్రోత్సాహం యివ్వలేదు. ఎంగెల్స్ అలా కాక "కుటుంబం" గురించి గొప్ప ప్రభావం గల విశ్లేషణ చేశాడు. ఆయన

యావజ్జీవితం స్త్రీవాదం పట్ల మరింత శుభప్రదమైన వైఖరి ప్రదర్శించాడు. మార్క్సిస్టులు స్త్రీవాదాన్ని విప్లవ పథం నుంచిచూస్తూ "బూర్జువా పక్కదారు"ల్లో ఒకటిగా పరిగణించారు. అలాగే మార్క్సిజం స్త్రీ పురుష సమానత్వానికి ప్రాధాన్యం యివ్వడానికి సంకోచిస్తుందని స్త్రీవాదులు భావించారు. అయినప్పటికీ పరస్పర సానుభూతి, సంబంధం చాలాకాలంగా వుందన్నమాట వాస్తవం. స్త్రీవాద చింతన బయట, స్త్రీల అణచివేత గురించి యేదో ఒక మార్క్సిస్టు చింతనాశీలి చేసినంత నిశిత పరిశీలనతో తూగే పరిశీలనను చెయ్యడం జరగలేదు. అలాంటి ఆచారమే కనిపించదు. లెనిన్, ట్రాట్స్కీ, బెబెల్ ముఖ్యంగా చెప్పుకో వాల్సిన వాళ్ళు. యీ రంగంలో ఎంగెల్స్ వరవడిని అంది పుచ్చుకున్న వాళ్ళు. సోషలిజానికి మార్క్సిస్టు పరివర్తనను అమలు చెయ్య చూసే సమాజాలు స్త్రీల విమోచన మీద విధాయకంగా దృష్టిపెట్టాయి. యు.ఎస్.ఎస్.ఆర్.లో కూడా, క్యూబాలాంటి నూతన సోషలిస్టు సమాజాలకంటే తక్కువ విప్లవ పూరితంగా వుంటుందని విమర్శలకు గురవుతున్న ఆ దేశంలో కూడా, పక్క దేశాలతో పోలిస్తే స్త్రీల స్థానం యెంతో మెరుగ్గా వుందని చెప్పాలి. (సోవియట్ మధ్య ఆసియాని పక్కనే వున్న ఇరాన్‌తో పోలిస్తే యీ విషయం మరింత స్పష్టంగా తెలుస్తుంది).

కమ్యూనిస్టు ఉద్యమంలో స్త్రీవాద చరిత్ర క్లారాజెట్కిన్, అలెక్సాంద్రా కొల్లాంటి లాంటి వాళ్ళ జీవిత చరిత్రలనుంచీ వుంది. మార్క్సిస్టు ప్రోత్సాహం పొందిన పాలనల్లో, మొత్తం మీద, అణగదొక్కే వ్యక్తిగత, కుటుంబ సంబంధాల స్త్రీవాద విమర్శలకు దీటుగా ప్రతిస్పందించడం లేదనే చెప్పాలి. కానైతే స్త్రీల పరిస్థితుల్లో భౌతికంగా మెరుగుదల వచ్చేటట్టు, చట్టపర, విధానపర సంస్కరణలు అమలు చేసేటట్టు కృషి జరిగింది. ఒక విషయాన్ని మాత్రం ఖాయంగా చెప్పచ్చు. యిటీవల యేదో ఒక రకం మత ఛాందసవాదంతో అధికారంలోకి వచ్చిన పాలనల్లోకంటే మార్క్సిస్టు ప్రేరిత కార్యక్రమాల్లో స్త్రీవాదాన్ని మరింత మన్ననగా చూడ్డం కనిపిస్తోంది అన్న విషయం.

